# రెండు వ్యవస్థలు

లాభనష్టాల బేరీజు

రచన:

అజయ్ కుమార్ ఘోష్

అనువాదం:

పరుచూరి కోటేశ్వరరావు

విశాలాంధ్ర ప్రచురణాలయం,

విజయవాడ - 2

# రెండు వ్యవస్థలు

## లాభనష్టాల బేరీజు

మానవజాతి చరిత్రలో ఇంతకుపూర్వం అనేక శతాలు గతించిపోయాయి; అయితే వర్తమానశతకం మాత్రం ఇతఃపూర్వపు శతాలన్నిటికంటే అత్యంత ప్రాధాన్యం కలిగియుంది.

గత కొద్ది దశాబ్దాలలోను చరిత్ర పెద్ద పెద్ద అంగలు వేసు కొంటూ పురోగమించింది; అనేక ఘటనలు జరిగాయి; అంతకు ముందెన్నడూ కనీ వినీ ఎరుగనంతటి కష్టనష్టాలకు కారణభూతమైన రెండు ప్రపంచయుద్ధాలు జరిగాయి; మహాభీకరమైన ఆర్థిక సంక్షోభానికి మానవాళి గురియైంది; ఫాసిజం అతి త్వరగా అభివృద్ధి చెందింది; అంత త్వరగానే అది తిరిగి అంతరించిపోయింది. రష్యా, చైనా, ఇంకా అనేక యూరప్, ఆసియా దేశాలలో సోషలిజం జయప్రదమైంది. భారతదేశం, ఇంకా అనేక యితర దేశాలు స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాయి. అంతర్జాతీయ వ్యవహారా లలో అవి గొప్పపాత్ర నిర్వర్తిస్తున్నాయి. విజ్ఞానశాస్త్రం, సాంకే తిక చాతుర్యం అపూర్వంగా పెంపొందాయి; అణుయుగం ఆరంభ మైంది; ఇటు మానవాభ్యున్నతికి, అటు మానవ విధ్వంసనకు కూడా పనికివచ్చే అణుశక్తి మానవుని హస్తగతమైంది. ఈ పరి ణామాలన్నింటినీ చూస్తుంటే కళ్ళు మిరుమిట్లుగొల్పేవిగా కన్పి స్తాయి. అవి మనకు అసలు అంతుచిక్కవేమో అన్నట్లు గోచ రిస్తాయి.

అయినప్పటికీ, ఒక విషయం మాత్రం ప్రజలందరికీ క్రమంగా విస్పష్టం కాజొస్తున్నది. పాత వ్యవస్థ అంతరించిపోతూండటం, కొత్త వ్యవస్థ అవతరిస్తూండటం ప్రజలు స్వయంగా చూస్తున్నారు. మొత్తంమీద ఈ దశలో మానవాళి అపూర్వమైన పురోగమనం సాగించింది.

భూగోళంలోని ఆరోవంతు భూభాగంలో పెట్టుబడిదారీ పాలన అంతరించిపోయి యింకా నలభై సంవత్సరాలన్నా పూర్తికాలేదు. ఈనాటి సోషలిస్టు ప్రపంచ విస్తీర్ణం ప్రపంచభూభాగంలో నాలుగో వంతుగా వుంది; ప్రపంచ జనాభాలో నూటికి 35 మంది ప్రజలు సోషలిస్టు ప్రపంచంలో నివసిస్తున్నారు. మొత్తం ప్రపంచ పారిశ్రామికోత్పత్తిలో నూటికి 30 వంతులు సోషలిస్టుదేశాలలో జరుగుతోంది. ఆర్థికంగా వెనకబడిన దేశాలను పారిశ్రామికవంతమొనర్చడానికి అవి గణనీయంగా సహాయపడగల స్థితిలో ఉన్నాయి. వలస పాలన అనే కబంధ కౌగిలినుంచి 120 కోట్లమంది ప్రజలు విముక్తులయ్యారు. పెట్టుబడిదారీ దేశాలలోని లక్షలాది ప్రజాసామాన్యం సోషలిజంకోసం పాటుబడుతున్న పార్టీల వెనుక సమీకృతమవుతున్నారు. ఆ పార్టీలు దిన దిన ప్రవర్ధమానమవుతున్నాయి.

1956 ఫిబ్రవరిలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ జరిగింది. నూతన యుగారంభానికి స్వాగతం పలుకుతున్న ఈ ఘటనలన్నింటి చారిత్రాత్మక ప్రాధాన్యాన్ని ఆ మహాసభ నొక్కి చెప్పింది. ఉజ్వలమైన గత కొలది సంవత్సరాల అనుభవాలను సింహావలోకనంచేసి, ప్రపంచశక్తుల బలాబలాలలో వచ్చిన మార్పును ఆధారం చేసుకొని, ఆ మహాసభ వర్తమాన ప్రపంచంలో దృగ్గోచరమవుతున్న నూతన లక్షణాలను విశదీకరించింది. అందుబాటులోవున్న నూతనావకాశాలేమిటో వివరించింది. ఆ అవకాశాలు కార్యరూపం ధరించడానికి చేయవలసిందేమిటో కూడా ఆ మహాసభ సూచించింది. ఆ మహాసభ మార్క్సిజం – లెనినిజం

ఉప దేశాలను సృజనాత్మక పద్ధతిలో అభివృద్ధిచేసి కాలదోషం పట్టిన కొన్ని సూత్రీకరణలను, ఐక్యతా సాధనకూ, పురోగమనానికీ అవరోధంగా తయారైన కొన్ని ప్రతిపాదనలను సంస్కరించింది. నూతన ప్రపంచ పరిస్థితిని కూలంకషంగా పరిశీలించినమీదట ఆ మహాసభ సాహసోపేతమైన కొన్ని నిర్ణయాలను చేసింది; తద్వారా అనుగమించవలసిన భావిమార్గాన్ని తేజోవంత మొనర్చింది.

20 వ మహాసభయొక్క అనన్య ప్రాధాన్యం ఇందులోనే వుంది.

ఆ మహాసభచేసిన నిర్ణయాలు, రూపొందించిన సూత్రీకరణలు ఏమిటి ? సోషలిజం ఒక ప్రపంచ వ్యవస్థగా రూపొందిందనీ, వలసవ్యవస్థ విచ్ఛిత్తిపొందిందనీ, పెట్టుబడిదారీ ప్రపంచ సంక్షోభం తీవ్రతరమవుతోందనీ, యుద్ధానికి వ్యతిరేకంగా సాగించే పోరాటం విజయవంతమయ్యే అవకాశం వుందనీ ఆ మహాసభ స్పష్టంజేసింది. సోషలిస్టు పరివర్తన నూతనరూపాలు ధరిస్తుందనీ, సోషలిస్టుల, కమ్యూనిస్టుల మధ్య తప్పక ఐక్యతను సాధించవలసియుంటుందనీ ఆ మహాసభ నిరూపించింది. ఆ మహాసభ నిర్ణయాలు, సూత్రీకరణలు యిప్పటికే బలీయమైన ప్రభావాన్ని మన మనస్సులపై ప్రసరింపచేశాయి; ఘటనల తీరుతెన్నులను యిప్పటికే అవి తీర్చి దిద్దసాగాయి. అన్ని దేశాలలోని అశేష ప్రజానీకం ఆనాటికానాడు ఈ సూత్రీకరణలలో గర్భితమైయున్న సత్యాన్ని కాంచగల్గుతారు.

సోషలిస్టు ప్రపంచం చుట్టూ సామ్రాజ్యవాదులు నిర్మించ దలచుకొన్న యినపగోడలు బీటలువారి నేలకూలిపోతున్నాయి. సోషలిస్టుదేశాలు యుద్ధాన్ని వాంఛిస్తున్నాయనీ, యితర దేశాల స్వాతంత్ర్యానికి ప్రమాదం తెచ్చిపెడుతున్నాయనీ సామ్రాజ్య వాదులు సాగించిన ప్రచారంలోని బండారం కాస్తా బయటపడి పోతోంది. సోవియట్ యూనియన్, చైనా, తదితర సోషలిస్టు

దేశాలపట్ల ఆగర్భశత్రుత్వం పూనినవారు సైతం అంతర్జాతీయ ఉద్రిక్తతను సడలించటానికి సోషలిస్టు దేశాలు గైకొన్న శాంతి చర్యలు అపారంగా తోడ్పడ్డాయని అంగీకరించక తప్పటం లేదు. సూయజ్ సమస్యపై ప్రజ్వరిల్లిన సంక్షోభంతో అసలు దురాక్రమణదారు లెవరో, చిన్న దేశాల స్వాతంత్ర్యానికి ప్రమాదం తెచ్చిపెడుతున్న దెవరో, చిన్న దేశాలకు నిజమైన మిత్రు లెవరో స్పష్టంగా తేలిపోయింది.

శాంతిశక్తులు, స్వాతంత్ర్యశక్తులు ఎంత బలవత్తరంగా తయారైనవో సూయజ్ సంక్షోభంలో స్పష్టంగా నిరూపితమైంది. 1935 లో ముస్సోలినీ అబిసీనియాపై దండెత్తి, దానిని పాదాక్రాంతం చేసుకొన్నట్లే ఈనాడు బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదులు ఈజిప్టును ఆక్రమించుకోవాలని దుందుడుకు చర్యకు ఉపక్రమించారు. కాని అసంఖ్యాక దేశాలుగల శాంతి శిబిరం బ్రిటిషు, ఫ్రెంచి సామ్రాజ్యవాదుల దుండగాన్ని ఎదుర్కొంటూ నిలబడింది. అరబ్ జాతీయతతో చైతన్య విలసితమైన, పులకితమైనశక్తులు సామ్రాజ్యవాదుల దౌష్ట్యాన్ని ఎదిరించారు. భారతదేశం, ఇండొనేషియా, బర్మా, తదితర స్వతంత్ర ఆసియా దేశాలు దృఢ సంకల్పంతో వారి ఆటలు సాగకుండా అడ్డుపడ్డాయి. సోవియట్ యూనియన్, చైనా ప్రజారాజ్యం, తదితర సోషలిస్టు దేశాల సైనికబలం, సాధన సంపత్తి సామ్రాజ్యవాదులకు సింహస్వప్నంగా తయారయ్యాయి. బ్రిటను, ఫ్రాన్సు దేశాలలోనే శాంతిశక్తులు, ప్రజాస్వామికశక్తులు సామ్రాజ్యవాదుల పన్నాగాలను ప్రతిఘటించసాగాయి. వీటన్నిటి ఫలితంగా, సామ్రాజ్యవాద కూటమిలోనే కీచులాటలు బయలుదేరాయి. మొత్తం ప్రపంచరంగమే పూర్తిగా మారిపోయింది. ఈ మార్పును సామ్రాజ్యవాదులు గుర్తించ నిరాకరించటమంటే, వారు చేజేతులా చేటు కొనితెచ్చుకోటం తప్ప మరొకటికాదని తేలిపోయింది.

గత నలభై సంవత్సరాలలోను సంభవించిన చారిత్రాత్మక పరిణామాలు మానవుల హృదయాలను పులకింపచేశాయి; ఉత్తేజపర్చాయి. ఇటు సిద్ధాంతరీత్యా, అటు ఆచరణరీత్యా అత్యంత ప్రాధాన్యం కల్గిన సమస్యలను – హింసా పద్ధతులు, శాంతియుత పద్ధతులు, పురోగమనమార్గాలు, సోషలిజానికీ, ప్రజాస్వామ్యానికీ మధ్య సంబంధాలు మున్నగు సమస్యలను – ఆ పరిణామాలు ముందుకు తెచ్చాయి. గతానుభవాన్ని, గుణపాఠాలను ఆధారం చేసుకొని నూతన దృక్పథంతో ఈ సమస్యలను మనం పరిశీలించ వలసి వుంటుంది.

## సోషలిజం : సుస్థిర శాంతి సాధనకు తిరుగులేని సాధనం

అసలు కమ్యూనిస్టు తత్వశాస్త్రంలోనే హింస గర్భితమై యున్నదని కొందరు బుకాయిస్తారు. కాని వాస్తవిక విషయాలను పరిశీలిస్తే, యీ బుకాయింపు అభూతకల్పన అని స్పష్టమవుతుంది.

హింస అన్నది యీనాటిది కాదు. లిఖితపూర్వకమైన ప్రాచీన మానవ చరిత్రను పరికించినా, విభిన్నరాజ్యాల మధ్య సంబంధాలను హింస నిర్ధరిస్తూవచ్చిందని తేటతెల్లం కాకమానదు. సామాన్య ప్రజలు ఎల్లప్పుడూ శాంతికోసమే పరితపిస్తూవచ్చారు. ఉత్తమోత్తములైన మతప్రవక్తలూ, మహోన్నతులైన మానవోత్తములూ అన్నికాలాలలో యుద్ధాలను నిశితంగా నిరసిస్తూనే వచ్చారు. యుద్ధాలకు, హింసకు మూలం మానవ స్వభావంలోని బలహీనతలు కారణమని వారు చెప్పుతూవచ్చారు; ఆ బలహీనతలను తొలగించటానికి వారు తమ తమ దృక్పథాల ప్రకారం కృషిచేశారు. కాని వారెంత పాటుబడినా, వివిధ దేశాల మధ్య, వివిధ తెగల మధ్య, వివిధజాతుల మధ్య, వివిధప్రజల మధ్య రక్తప్లావితమైన సంఘర్షణలు పదేపదే జరుగుతూవచ్చాయి. శాంతి

అన్నది ఎల్లప్పుడూ కేవలం వాంఛగా మాత్రమే, సాధించ నలవి గాని లక్ష్యంగామాత్రమే మిగిలిపోతూ వచ్చింది.

వర్గ సమాజానికీ, యుద్ధానికీ గల మూలసంబంధమేమిటో, మహామేధావులైన మార్క్స్, ఏంగిల్స్ మహాశయులు మొట్ట మొదటసారిగా స్పష్టంచేశారు: "1864 నవంబరులో అంతర్జాతీయ శ్రమజీవుల సమితి ప్రారంభోపన్యాసం" లో ఆ సమితి వైదేశిక నీతిని వివరిస్తూ మార్క్స్ యిలా పేర్కొన్నారు: "సమాజంలోని వ్యక్తుల మధ్య సంబంధాలను తీర్చిదిద్దే సామాన్యమైన నీతి సూత్రాలు, న్యాయసూత్రాలే వివిధ జాతుల మధ్య సంబంధాలను కూడా తీర్చిదిద్దేవిగావుండాలి" (కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగిల్స్ : సెలక్టెడ్ వర్క్స్, సంపుటి : 1; పేజీ 385)

1870 లో ఫ్రాన్సుకు, ప్రష్యాకుమధ్య యుద్ధం ప్రజ్వరిల్లిన ప్పుడు, దూరదృష్టితో మార్క్స్ ఇలా చెప్పారు :

"ఒక ప్రక్క ఫ్రెంచి అధికారులు, జర్మన్ అధికారులు పరస్పర సంహారానికి ఉద్యమిస్తున్న సమయంలోనే, మరొకప్రక్క ఫ్రెంచి శ్రామికులు, జర్మన్ శ్రామికులు పరస్పరం శాంతి సందే శాలు, శుభసందేశాలు అందజేసుకొన్నారు. ఇది చాలా గొప్ప విషయం. ఇలాంటిది జరగటం చరిత్రలోనే అపూర్వం. ఉజ్వల భవిష్యత్తుకు ఇదొక శుభసూచన. ఆర్థిక సంబంధమైన యమయా తనలూ, రాజకీయమైన ఉన్మత్త స్థితీ ప్రబలంగావుండే పాతవ్యవ స్థకూ, ఇప్పుడిప్పుడే తలెత్తుతున్న నూతన వ్యవస్థకూ మధ్యగల వ్యత్యాసమేమిటో అది నిరూపిస్తోంది. నూతన వ్యవస్థలో సర్వే సర్వత్రా శ్రమజీవులే పాలకవర్గంగా వుంటారు గనుక, శాంతి అన్నది నూతన వ్యవస్థయొక్క అంతర్జాతీయ నియమంగా వుం టుంది" (అదే సంపుటిలో 490 వ పేజీ).

ఫాసిజాన్ని 'పోలినదే' కమ్యూనిజం అంటూ పదే పదే వక్కాణిస్తున్న ప్రబుద్ధులు మార్క్స్ మహాశయుని పై వాక్యా

లను ఫాసిజానికి మూలపురుషులైన వారిలో ఒకడైన ముస్సోలినీ మాటలతో పోల్చిచూచుకోవాలి. యుద్ధాలను బాహాటంగా స్తుతిస్తూ ముస్సోలినీ యిలా అన్నాడు :

"శాశ్వతశాంతి ఆవశ్యకత విషయంలోగానీ, దాని ప్రయోజనం విషయంలోగానీ ఫాసిజానికి ఈషణ్మాత్రం విశ్వాసంలేదు. అందుచేత శాంతి ప్రియత్వాన్ని అది (ఫాసిజం) వ్యతిరేకిస్తుంది; శాంతి ప్రియత్వం అంటే పోరాట నిరాకరణతప్ప మరొకటికాదు; త్యాగం చేయవలసినప్పుడు పిరికితనం ప్రదర్శించటంతప్ప వేరొకటికాదు. కేవలం యుద్ధంవల్లనే మానవశక్తి సామర్థ్యాలు ఇనుమడిస్తాయి; యుద్ధం చేయగల్గిన సాహసం, తాహతువున్న దేశాలు ఉదాత్తస్థానం అలంకరిస్తాయి." ("గ్లిమ్ప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరీ"లో నెహ్రూచే ఉల్లేఖించబడిన భాగం 825 వ పేజీ)

అయితే యిది కేవలం సిద్ధాంతానికి మాత్రమే సంబంధించిన విషయం కాదు. గత నలభై సంవత్సరాల చరిత్రను పరికించి చూస్తే, మార్క్స్ మహనీయుని ప్రవచనాలలో ఎంతటి మహత్తర సత్యంవుందో విదితం కాగలదు.

సోవియట్ యూనియన్ అవతరించినదాదిగా, వివిధ దేశాలతో శాంతి సంబంధాలను నెలకొల్పుకోటానికే అది కృషిచేస్తూ వచ్చింది. ఫాసిజం తలెత్తిన వెంటనే ప్రపంచం యుద్ధాగ్నిగుండంలోకి ఏక్షణాన యీడ్వబడుతుందోనని ఆందోళన సర్వత్రా అలముకొంది. ఆ కొలది సంవత్సరాలలో సోవియట్ యూనియన్ అనేక నిర్మాణాత్మక ప్రతిపాదనలను ప్రతిపాదిస్తూ వచ్చింది. ఆ ప్రతిపాదనలను యితర దేశాలు కనుక అప్పుడే ఆమోదించివుంటే, రెండో ప్రపంచయుద్ధం ఉప్పతిల్లివుండేది కాదు; అంత మారణహోమం జరిగివుండేది కాదు. సోషలిజం ప్రపంచ వ్యవస్థగా రూపొందటంతో, సుస్థిర శాంతి స్థాపనకు గట్టి ప్రాతిపదిక ఏర్పడింది. అంతర్జాతీయ ఉద్రిక్తత సడలింపుకు సోషలిస్టు ప్రపంచం

గైకొన్న చర్యలు మొత్తం శాంతిప్రియ మానవాళి ప్రశంసలకు పాత్రములైనవి. ఏయే రాజ్యాలలో ఐతే శ్రమజీవులు అధికారం నిర్వహిస్తున్నారో, ఆయా రాజ్యాలే శాంతికి కంచుకోటల్లాగా వున్నాయన్న విషయం యీ రోజున ఎవరూ కాదన లేరు.

సామ్రాజ్యవాదం యిప్పటికీ బలీయంగానే వుంది; పెద్ద పెద్ద భూభాగాలపై అది యింకా పెత్తనం చేస్తోనేవుంది. అయితే, ప్రజాస్వామ్యం, శాంతి, సోషలిజంకోసం పాటుబడుతున్న శక్తులు యుద్ధోన్మాదశక్తుల ఆటలను కట్టించి, మట్టిపెట్టగల్గిన శక్తిసామర్థ్యాలను సంపాదించుకొన్నాయి

సోషలిజం విజయమంది, అంతకంతకు విస్తరించే కొలదీ, యుద్ధ ప్రమాదం యింకోధికం కాకపోగా, సుస్థిర శాంతికి అనుకూల పరిస్థితులు ఏర్పడతాయని జీవితానుభవం చాటిచెబుతోంది.

ప్రపంచంలో యిప్పుడు నూతన పరిస్థితులు లేర్పడినవి కనుక, కేవలం యుద్ధాన్ని నివారించటానికి మాత్రమే కాక కొత్త మార్గాలలో సోషలిజాన్ని సాధించటానికికూడా అపారమైన అవకాశాలు సమకూడినవి. సోషలిజం జయప్రదమైన దేశాలలో సాధించబడిన ఘనతర విజయాలవల్ల నైతేనేమి, ప్రపంచమంతటాగల కార్మికోద్యమం, ప్రజోద్యమం బలవత్తర మవడంవల్ల నైతేనేమి సోషలిస్టు భావాలు మానవుల మనస్సులలో స్థిరపడి పోయాయి. అనేక దేశాలలో సోషలిస్టుశక్తులు పార్లమెంటరీ మెజారిటీ సంపాదించగల అవకాశం హెచ్చుతోంది; పార్లమెంట్లలో సంపాదించే మెజారిటీకి తోడు ప్రజోద్యమాన్ని సమీకరించటంద్వారా సమూలమైన సామాజిక పరివర్తన తీసుకొచ్చే అవకాశాలుకూడా హెచ్చుతున్నాయి.

## వర్గపోరాటం: హింస

అయితే, అసలు వర్గపోరాట సిద్ధాంతంలోనే హింస గర్భితమై లేదా? వర్గపోరాటం చివరకు అంతర్యుద్ధంగా పరిణమించక

తప్పదుగదా ? అని కొందరు ప్రశ్నించవచ్చు. ఒక ప్రక్క వర్గ పోరాటం అనివార్యం అని విశ్వసించేవారే, శాంతియుత సోషలిస్టు పరివర్తన సాధ్యం అని ఎలా నమ్మగలరు ?

వర్గ పోరాటం అన్నదానిని సృష్టించినది మార్క్సిస్టులు కాదన్న సంగతి ముఖ్యంగా గుర్తుంచుకోవాలి. పరస్పర విరుద్ధమైన ప్రయోజనాలు గల వర్గాలు ఏ సమాజంలో ఉంటాయో, అలాంటి ప్రతి సమాజంలోను వర్గపోరాటమనేది వుండక తప్పదు. ఈనాటి మన సమాజం అందుకు భిన్నమైనది కాదు.

కమ్యూనిస్టులు వర్గ సంఘర్షణలను రెచ్చగొడుతున్నారని యీనాడు ఆరోపిస్తున్న పండిత నెహ్రూయే ఒకనాడు యీ సమస్యను గురించి ఏమి వ్రాశారో చూడండి :

"వర్గ సంఘర్షణను మార్క్సు బోధించలేదు. నిజానికి అలాంటిది ఉన్నదనిమాత్రమే ఆయన నిరూపించి చూపించాడు; అది ఏదో ఒకరూపంలో ఎల్లప్పుడూ వుంటూనేవచ్చింది. 'ఆధునిక సమాజ రూపురేఖలను తీర్చిదిద్దుతున్న ఆర్థిక పరిణామక్రమ సూత్రాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించటంకోసమే' మార్క్సు 'కాపిటల్' గ్రంథం రచించారు. ఆధిపత్యం సంపాదించుకొన్న వర్గం తన నిజమైన వర్గ స్వభావాన్ని కప్పిపుచ్చుకోటానికే ప్రయత్నిస్తుంది కనుక, యీ సంఘర్షణలు అన్నిసందర్భాలలోను వర్గ పోరాటాలుగా పైకి కన్పించకపోవచ్చు. కాని, అమలునందున్న వ్యవస్థకు ప్రమాదమేర్పడినప్పుడు మాత్రం, పాలకవర్గం తన నంగనాచితనానికి స్వస్తి చెప్పి బాహాటంగా బరిలోకి దిగుతుంది; అప్పుడే దాని నిజ స్వభావం వెల్లడవుతుంది; వర్గాలమధ్య బాహాటమైన పోరాటం ప్రజ్వరిల్లుతుంది. ఇలాంటిది జరిగినప్పుడల్లా ప్రజాస్వామిక రూపాలు, సాధారణ చట్టాలు, న్యాయసద్ధతులు అన్నీకూడా మటుమాయమై పోతాయి. కొంతమంది చెప్పుతున్నట్టు ఏవో అపార్థాలవల్లనో లేక ఎవరో కుచ్ఛితబుద్ధిగలవారు సాగిస్తున్న ఆందోళనోద్యమాల

వల్లనో యీ వర్గ పోరాటాలు సంభవించుతున్నాయనటం సత్య దూరమైన విషయం. నిజానికి యీ వర్గ పోరాటాలు సమాజం లోనే గర్భితమై వున్నాయి. పరస్పరం సంఘర్షించే ప్రయోజనాలను గురించిన విస్పష్ట అవగాహన ఏర్పడేకొలదీ, అవి మరింత యీనోధిక మవుతూవుంటాయి." (అదే గ్రంథం 547 వ పేజీ).

భారత దేశంలోని పరిస్థితులను గురించి ప్రస్తావిస్తూ ఆయనే యింకా యిలా వ్రాశారు :

"దేశంలో వివిధ ప్రయోజనాల మధ్య తీవ్రమైన సంఘర్షణలు గలవనటం నిర్వివాదాంశం. అందుచేత ప్రతి చట్టం, ప్రతి విధానం ఒక ప్రయోజనానికి లాభదాయకమైనదిగావుంటే, మరొక ప్రయోజనానికి నష్టదాయకంగా వుంటుంది......సమాజంలో గర్భితమైయున్న ఈ సంఘర్షణ, అవ్యవస్థ నానాటా సమాజంలోని నరనరానికి విస్తరిస్తున్నాయి. దీనిని ఉష్ట్రపక్షిలాగా గుర్తించ నిరాకరించటమంటే అర్థం వాస్తవాన్ని చూడ నిరాకరించటమే అవుతుంది. వాస్తవం చూడ నిరాకరించినమాత్రాన సంఘర్షణ, అవ్యవస్థ లేకుండాపోవు; వాస్తవం అవాస్తవంగానూ మారిపోదు. ఒక రాజకీయవేత్తగానీ, కార్యదక్షుడుగానీ అలాంటి ఉష్ట్రపక్షి విధానాన్ని అవలంబిస్తే, చివరకు ప్రమాదంలో చిక్కుకోక తప్పదు" (విదర్ ఇండియా; 41, 43 పేజీలు).

అందుచేత వర్గపోరాటంలో విశ్వాసం వుందా లేదా అన్నది అసలు సమస్య కానేకాదు. నిజానికి వర్గపోరాటం అనేది యిప్పటికే ప్రజ్వరిల్లుతూ వుంది. అలా ప్రజ్వరిల్లుతూన్న పోరాటంలో ఏ పక్షం వహించాలి – అన్నదే అసలు సమస్య. వర్గ సమాజానికి స్వస్తి చెప్పి, తద్వారా వివిధవర్గాలమధ్య పోరాటం లేకుండా చేసే నిమిత్తం వర్గపోరాటాన్ని ఎలా కొనసాగించాలి అన్నదే అసలు సమస్య.

పెట్టుబడిదారీ వ్యవస్థను రద్దుచేసి, దానిస్థానే సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పిననాడే వర్గపోరాటం అంతరించి పోతుందని మార్క్సిస్టులు స్పష్టీకరించారు. ఈసూత్రీకరణకు పండిత నెహ్రూయే అనేకసార్లు తన ఆమోదం వ్యక్తం చేశారు.

హింస, అంతర్యుద్ధాలతో నిమిత్తం లేకుండా పెట్టుబడిదారీ వ్యవస్థను రద్దుచేయటం సాధ్యమేనా? అన్న ప్రశ్నకు సాధ్యం కాదనే ఇంతకుపూర్వం మార్క్సిస్టులు సమాధానం చెప్తూ వచ్చారు. హింస అన్నది ప్రీతికరమైనందున కాదు వారలా సమాధాన మిచ్చింది; పాలకవర్గాలను బలవంతాన మెడపట్టి గెంటితేతప్ప గద్దెనుంచి వారు దిగబోరు కనుకనే వారు అలా సమాధానం చెప్పారు. ఈ విషయాన్ని పండిత నెహ్రూ గుర్తించారు. అందుకనే "అమలునందున్న వ్యవస్థకు ప్రమాదం వచ్చిపడ్డప్పుడు మాత్రం అది (పాలకవర్గం) తన నంగనాచితనానికి స్వస్తి చెప్పి, బాహాటంగా బరిలోకి దిగుతుంది. అప్పుడే దాని నిజస్వభావం వెల్లడవుతుంది. వర్గాలమధ్య బాహాటమైన పోరాటం ప్రజ్వరిల్లుతుంది."

గత నలభై సంవత్సరాల చరిత్రచూస్తే హింస ఎప్పుడు సంభవించినా అది కమ్యూనిస్టుల వాంఛితంవల్ల సంభవించలేదనీ, పాలకవర్గాలు ప్రజలపై బలవంతాన అంతర్యుద్ధాన్ని రుద్దటంవల్లనే హింస జరిగిందనీ తేటతెల్లంకాకమానదు. దాదాపు అన్ని సందర్భాలలోకూడా ఒక దేశంలోని పాలకవర్గాలకు ఇతర దేశాలలోని పాలకవర్గాలు తోడ్పడుతూ వచ్చాయన్న సంగతికూడా సుస్పష్టమే.

రష్యాలోని పెట్టుబడిదారులు, భూస్వాములు చాలా కొద్దిపాటి హింసతో మాత్రమే అధికారంనుంచి తొలగించబడ్డారు. అయితే అధికారంనుంచి అలా తొలగింపబడిన పెట్టుబడిదారులు, భూస్వాములు సామ్రాజ్యవాదుల సహాయంతో దీర్ఘకాల రక్తప్లావిత అంతర్యుద్ధాన్ని ప్రజలపై రుద్దారు. జర్మనీలో ప్రజా

స్వామ్యాన్ని కాలరాసిందీ, జర్మనీ ప్రజలను నాజీ దుష్కృత్యా లకు గురిచేసిందీ, బ్రిటీషు, ఫ్రెంచి పాలకులు పాలుపోసి పెంచిన హిట్లరే కాని, కమ్యూనిస్టులు కాదు. స్పెయిన్ దేశాన్ని రక్త వాహినులలో ముంచెత్తిందీ, మానవ హత్యాకాండ కొనసాగిం చిందీ ఫ్రాంకో, అతని ఫాసిస్టు తొత్తులేకాని, కమ్యూనిస్టులు, సోషలిస్టులు, ప్రజాతంత్రవాదులు కాదు. జపాను ఓడిపోయిన తర్వాత మిశ్రమ ప్రభుత్వాన్ని స్థాపిద్దామంటూ చైనా కమ్యూ నిస్టులు చేసిన ప్రతిపాదనను కాలదన్ని, చైనా దేశాన్ని అంతర్యుద్ధ మనే అగ్నిగుండంలోకి పడద్రోసింది చాంగ్-కై షేక్, అతని సామ్రాజ్యవాద మిత్రులు మాత్రమే. చివరకు యిప్పుడుకూడా వియత్నామ్ ఏకీకరణను శాంతియుతంగా సాధించటానికి ఆటంకంగా వున్నది ఎవరు ? అమెరికన్ సామ్రాజ్యవాదుల అండదండలతో నియంతృత్వపాలన కొనసాగిస్తున్న దక్షిణ వియత్నామ్ ప్రభుత్వమే ఒప్పందాలను కాలదన్నుతూ, శాంతియుత ఏకీకరణను నిరోధిస్తోంది.

హింసకు, అంతర్యుద్ధ ప్రజ్వలనకు కారణం ఎల్లప్పుడూ పాలకవర్గాల చర్యలేనని చరిత్ర నిరూపిస్తోంది. దానిని ఎవరూ కాదనజాలరు. ప్రజలలో పలుకుబడిని పూర్తిగా కోల్పోయిన తర్వాతకూడా, గద్దెనుంచి దిగటానికి పాలకవర్గాలు నిరాకరిస్తూ, తమ అధికారాన్ని నిలుపుకొనేందుకు దౌర్జన్యకాండ ప్రారంభిస్తూ వచ్చారు. తమ దేశప్రజలను హతమార్చటంకోసం ఆ పాలక వర్గాలు విదేశాల సహాయం స్వీకరించటానికికూడా వెనుదీయ లేదు. ప్రజలలో అధిక సంఖ్యాకులు ప్రభుత్వం మారిపోవాలనీ, సామా జిక పరివర్తన కావాలనీ కోరుతున్నప్పుడు, జనాభాలో అత్యధికుల అభిప్రాయాన్ని అణచే నిమిత్తం దోపిడీదారులలో అధిక సంఖ్యాకులు బలప్రయోగానికి దిగినప్పుడు - ప్రజలు కూడా బలప్రయోగానికి ఉపక్రమించటం ప్రజాస్వామ్య సూత్రాలనుబట్టిచూసినా, న్యాయ సూత్రాలనుబట్టిచూసినా సమర్థనీయమైనదే. రష్యా, చైనా, తది తర దేశాలలో సరిగా అలాగే జరిగింది.

అయితే, ఈనాడు విప్లవకారులముందున్న మార్గం అదొక్కటేకాదు. సోషలిస్టు, ప్రజాస్వామిక శక్తులు నేడు అపారంగా అభివృద్ధిచెందాయి. సామ్రాజ్యవాదశక్తులు, అభివృద్ధి నిరోధక శక్తులు బాగా బలహీనపడ్డాయి. ఐక్యప్రజాకార్యాచరణద్వారా పాలకవర్గాలు ఫాసిస్టు చర్యలకు ఉపక్రమించకుండా నేడు నిరోధించవచ్చు. సామ్రాజ్యవాదులు జోక్యం కల్పించుకొనటానికి ప్రయత్నిస్తే వారి ఆటలను కట్టించవచ్చు. శాంతియుత పరివర్తనకు అత్యవసరమైన ప్రజాతంత్ర హక్కులను పరిరక్షిస్తూ, నిరంతరం వాటిని విస్తరింపచేయటం నేడు సాధ్యమైన విషయం. వీటన్నిటి మూలాన నూతన అవకాశా లీరోజున లభిస్తున్నాయి.

ఏ యే దేశాలలో ప్రజాస్వామిక అభిప్రాయాలకు తలొగ్గటానికి బూర్జువావర్గం, భూస్వాములు నిరాకరిస్తారో, అలాంటిదేశాలన్నింటిలోను పోరాటం భీషణరూపంలో దీర్ఘకాలం కొనసాగక తప్పదు. అయితే ఈ పోరాటం విధిగా అంతర్యుద్ధరూపం ధరించవలసిన అవసరమూ లేదు; రక్తప్లావితమూ కానక్కరలేదు. ప్రజలముందు నిలబడి, నిజం చెప్పటానికి కమ్యూనిస్టులెన్నడూ వెనుదీయరు. వారు తమ అభిప్రాయాలను, లక్ష్యాలను, చివరకు పద్ధతులను ఎన్నడూదాచిపెట్టుకోవాలని కోరరు. కొత్తరూపాలలో సోషలిస్టు పరివర్తన సాధ్యమని వారిప్పుడు అంటున్నారంటే, ఏదో ప్రజలను మోసపుచ్చటం కోసంకాదు. యావత్ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర దీనినే నిరూపిస్తుంది.

సోషలిస్టు పరివర్తనను శాంతియుత పద్ధతులలో సాధించటానికి అవకాశం వున్నదని చెప్పటం అంటే, ఏదో పబ్బం గడుపుకోటానికి చెప్పుతున్న మాటలుకావు. వాస్తవ విషయాలను ఆధారం చేసుకొని ఏర్పరచుకొన్న గట్టి విశ్వాసం అది. అందుచేత దానినిబట్టే కమ్యూనిస్టుల నిత్య కార్యకలాపాలు ఆధారపడి వుంటాయి. ఉన్న అవకాశాన్ని ఆచరణరూపం ధరింపచేసే నిమిత్తం ప్రతిదేశంలోనూ కమ్యూనిస్టు, సోషలిస్టు, దేశభక్తశక్తి

లన్నింటినీ సమైక్యపర్చి, తద్వారా బలీయమైన ప్రజోద్యమాన్ని నిర్మించటానికి కృషిచేస్తారు.

## సోవియట్ యూనియన్‌లో నిరంకుశ చర్యలు : క్రూరకృత్యాలు

"ఇదంతా నిజమే కావచ్చు; అయితే సోషలిస్టు దేశాలలో సాగుతున్న హింసాకాండ మాటేమిటి ? సోవియట్ యూనియన్‌లో అన్ని సంవత్సరాలపాటు కొనసాగిన అత్యాచారాల సంగతి ఏమిటి? నిరంకుశత్వం పెచ్చుపెరిగి, ప్రజాస్వామిక హక్కులను అణచటం ఎందుకు జరిగింది ? విచ్చలవిడిగా అరెస్టులు, ఏ పాపమూ చేసి యెరుగని అమాయకులపై ఏవేవో నేరాలు బనాయించి, వారిని చిత్రహింసలు పాల్జేసి, బలవంతాన చేయని నేరాలు చేశామని వారిచేత ఒప్పించటం మాటేమిటి ? సోషలిస్టు వ్యవస్థలో, చివరకు మార్క్సిజం – లెనినిజం ఉపదేశాలలోనే ఎక్కడో ఏదో పెద్ద లోపం వున్నదని యీ విషయాలన్నీ స్పష్టం చేయటంలేదా ?" – అంటూ అనేకమంది ప్రశ్నించవచ్చు.

ఇలా ప్రశ్నించేవారిలో కొందరు సోవియట్ యూనియన్‌కు, సోషలిజానికి ఆగర్భశత్రువు లున్నారు. పైన పేర్కొన్న ఘటనలు జరగటం వారి కెంతో సంతోషంగా వుంది. ఎందుకంటే, సోష లిజాన్ని అప్రతిష్ట పాల్జేయటానికి ఆ ఘటనలు తమకు చక్కని అవకాశం కలుగజేస్తున్నాయి. అయితే యిలాంటి సందేహాలు వెలిబుచ్చుతున్న వారిలో అనేకమంది ప్రజాతంత్రవాదులు, చాలా మంది నిజమైన సోషలిస్టులు, సోవియట్‌యూనియన్‌కు మిత్రులైన వారుకూడావున్నారు. వారిఉద్దేశాలనుగాని, నిజాయితీనిగానిశంకించ వలసిన అవసరంలేదు. కేవలం ఆర్థికరంగం విషయంలో మాత్రమే కాక, మానవునికీ మానవునికీ మధ్యవుండే సంబంధాల విషయంలో కూడా పెట్టుబడిదారీ విధానాన్ని ద్వేషిస్తున్న అనేకమంది వ్యక్తులు యిప్పుడు సోషలిస్టు దేశాలలో బహిర్గతమైన యీ వాస్తవిక విషయాలను కాంచి ఎంతో మానసికవ్యథకు లోనవుతున్నారు.

ఇలాంటి నిజాయితీపరులు వెలిబుచ్చుతున్న అనుమానాలను ఈసడింపుతో త్రోసిపారేసినందువల్ల ఎలాంటి ప్రయోజనం కల గదు. పోనీ, జరిగిన వాటన్నిటినీ నూతన వ్యవస్థ ప్రసవవేదనక్రింద జమకట్టటానికికూడా వీలులేదు. అదే కనుక నిజమైతే, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ ప్రతినిధులను సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రత్యేకంగా సమావేశపర్చి నిరంకుశ చర్యలకు, క్రూరకృత్యాలకు సంబంధించిన వివరాలన్నింటినీ బయటపెట్టి వుండేదికాదు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఈ ఘటనలు చాలా దారుణమైనవని భావించింది కనుక, ప్రత్యేకంగా ప్రతినిధుల సమా వేశాన్ని ఏర్పాటుచేసి, వాటన్నిటినీ బయటపెట్టాలని అభిప్రాయ పడింది. సోవియట్ ప్రజాస్వామ్యం, సోవియట్ న్యాయశాస్త్రం, సోషలిస్టు నీతిసూత్రాలు ఘోరంగా ఉల్లంఘించబడినవి. ఏవిధం గానూ వాటిని సమర్థించటానికి వీలులేదు.

ఈ ఘటనలను గురించి మొట్టమొదటిసారిగా విన్నప్పుడు ఇతర కమ్యూనిస్టుపార్టీలవలెనే భారత కమ్యూనిస్టుపార్టీకూడా చాల బాధపడింది. గతంలో జరిగిన పొరపాట్లను గురించి 20 వ మహాసభ ప్రతినిధుల ప్రత్యేక సమావేశంలో నివేదించిన తీరుకు మేము మా అనంగీకారాన్ని వెల్లడించాం; ఆ ప్రత్యేక సమా వేశంలో సమర్పింపబడిన నివేదికను బూర్జువాపత్రికలు ప్రకటించాయి; బూర్జువా పత్రికలలో ప్రకటితమైన ఆ నివేదికలోని అంశా లను సోవియట్‌పార్టీ అధికారరీత్యా ఖండించలేదు. మొత్తం సోవియట్ చరిత్రతో జె. వి. స్టాలిన్‌పాత్ర అవినాభావంగా ముడి వడి వుంది కనుక, ఆయనపాత్ర మంచి చెడ్డలను వాస్తవికదృష్టితో, సాకల్యంగా పరిశీలించటం అవసరమనీ, తద్వారా సరియైన అంచనా వేయటం తక్షణావసరమనికూడా మేము స్పష్టంచేశాం. సాకల్య పరిశీలనద్వారా లోగడ జరిగిన నిరంకుశచర్యలకు, క్రూర కృత్యాలకు మూలకారణాలేమిటో తెలుసుకోవాలనీ, అలా చేసి నప్పుడే తిరిగి అలాంటి తప్పిదాలు ఉత్తరోత్తరా జరగకుండా నివా

రించడం వీలవుతుందనీ మేము వక్కాణించాం. 1956 జులైలో మా కేంద్రకమిటీ చేసిన "వ్యక్తిపూజకు వ్యతిరేకంగా పోరాటం" అన్న తీర్మానంలో పై విషయాలన్నీ స్పష్టం చేయబడినవి.

ఇంతకీ, జరిగిన వాటికి స్టాలిన్ ఎంతవరకు బాధ్యుడు? ఇతరులు ఎంతవరకు బాధ్యులు? అన్నది కాదు, అత్యంత ప్రధానమైన సమస్య. సోషలిస్టు సమాజంలో అసలు అలాంటివి ఎలా జరిగాయి అన్న ప్రశ్నే అనేకమందిని వేధించుకు తింటోంది. అత్యంత ప్రాధాన్యంగల సమస్యకూడా అదే. దానిని గురించి అన్ని దేశాలలోని కమ్యూనిస్టులు, సోషలిస్టులు- వారు అధికారంలో వున్నా, లేకపోయినా దీర్ఘంగా ఆలోచించాలి.

సోవియట్ వ్యవస్థలో, మార్క్సిస్టు తత్వశాస్త్రంలో అలాంటి క్రూరకృత్యాలు అనివార్యమైనవని కొందరు సమాధానమిస్తారు. అయితే తమ వాదనను బలపర్చుకోటానికి వారు ఎలాంటి నిదర్శన చూపటంలేదు. ఒకానొక తత్వశాస్త్రంలోనో లేక దానిపై నిర్మితమైన రాజకీయ వ్యవస్థలోనో హింస గర్భితమైవున్న పక్షంలో అది ప్రతిరంగంలోను - సైనిక బలహీనతలవంటి కారణాలవల్ల అరికట్టబడితే తప్ప - ప్రత్యక్షమై తీరుతుందన్న విషయం ప్రతివారికి తెలిసినదే. దేశంలోపల ప్రజాస్వామ్యాన్ని అణచివేసే జాత్యంహంకార విధానాన్ని అనుసరించిన యితర దేశాలపై దురాక్రమణ విధానాన్ని చేపట్టిన ఫాసిజం హయాంలో సరిగా అలాగే జరిగింది. జారిస్టు ప్రభుత్వం శతాబ్దాల తరబడి దేశంలోపల ప్రజాస్వామ్యాన్ని కాలరాస్తూ, మహారష్యన్ జాత్యంహంకారాన్ని రెచ్చగొట్టుతూ, శాంతికి ప్రమాదం తెచ్చిపెట్టిందన్న సంగతి ఎవరికి తెలియదు? అయితే, సోవియట్ యూనియన్ తన యిరుగు పొరుగున గల బలహీన దేశాలలో జారుచక్రవర్తులు బల ప్రయోగంద్వారా సంపాదించుకొన్న అసాధారణమైన హక్కులను, ప్రయోజనాలను తనంతట తాను వదలుకొంది; ఇరుగుపొరుగున గల బలహీన దేశాలన్నింటితోను స్నేహసంబంధాలు నెలకొల్పు

కొంది; బలవత్తరమైన జాతి బలహీన జాతుల్ని పీడించేవిధానానికి శాశ్వతంగా స్వస్తిచెప్పింది. సోవియట్ యూనియన్ సైనికబలం యేటా యితోధికం కాసాగింది. అయినప్పటికీ, సోవియట్ ప్రభుత్వం ఎన్నడూ కయ్యానికి కాలుదువ్వలేదు. పైగా, శాంతి రక్షణకే అచంచలంగా పోరాడుతూ వచ్చింది. సోవియట్ దేశ ప్రజలు, వారి నాయకులు శాంతిని ప్రగాఢంగా వాంఛిస్తున్నారనీ, ఆ దేశంలో యుద్ధప్రచారంగానీ, యితర దేశాలపై ద్వేషపూరిత ప్రచారంగానీ, జాత్యంహాకార జాడలుగానీ మచ్చుకైనా కాన రాలేదనీ సోవియట్ యూనియన్‌ను సందర్శించినవారంతా - మిత్రులూ, విమర్శకులుకూడా - చెప్తూతున్నారు.

ఈ వాస్తవిక విషయాన్ని దృష్టిలో పెట్టుకొని, పరిస్థితిని పరిశీలిద్దాం. ఇతర దేశాల విషయంలో శాంతి విధానాన్ని తు. చ. తప్పకుండా పాటిస్తున్న దేశంలో దేశీయ వ్యవహారాల విషయమై న్యాయశాస్త్ర అతిక్రమణలు, దమననీతి ఎలా సంభవించాయి? కేవలం మార్క్సిజం - లెనినిజానికి సంబంధించిన మూలఉపదేశాలను పరిశీలించినంతమాత్రాన ఈ ప్రశ్నకు సమాధానం లభ్యంకాదు. అలాగే 'అధికార వ్యామోహం ఎన్ని పనులైనా చేయిస్తుంది' అనే సూక్తి కూడా ఈ సందర్భంలో మనకు సంతృప్తికరమైన సమాధానం యివ్వజాలదు. ఇతర విషయాలనుంచి కేవలం అధికారాన్ని వేరుచేసి చూసినట్లయితే, అసలు సమస్య మనకు అంతు చిక్కదు. అధికారాన్ని నిర్వహిస్తున్నది ఎవరు? దేనికోసం ఆ అధికారం ఉపయోగించబడుతోంది? ఇంతకుముందే స్పష్టంచేసినట్లు, సోవియట్ యూనియన్ సంపాదించుకొన్న సైనిక బలంలో నూరోవంతు బలాన్ని కూడా జారిస్టు రష్యా ఎన్నడూ కలిగిలేదు. అయినా జారిస్టు రష్యావలె, సోవియట్ యూనియన్ ఏనాడు ఏ ఇతర దేశస్వాతంత్ర్యానికి ప్రమాదం తెచ్చిపెట్టలేదు; పైగా, స్వాతంత్ర్యానికి, శాంతికి పెట్టనికోట వలె అది నిలబడుతూవచ్చింది.

అందుచేత సోవియట్ యూనియన్‌లో జరిగిన ఘోరాలకు గల కారణాలను అర్థం చేసుకొనేందుకు, ఏయే చారిత్రక పరిస్థితులలో మొట్ట మొదటి సోషలిస్టురాజ్యం అవతరించిందో, ఎలాంటి కష్టనష్టాలను అధిగమిస్తూ అది ముందుకు సాగవలసివచ్చిందో పూర్తిగా పరిశీలించవలసివుంటుంది.

## సోషలిస్టుదేశాన్ని సర్వనాశనం చేసేందుకు సాగిన యత్నాలు

ఆనాటికి రష్యా పారిశ్రామికంగా ఎంతో వెనకబడియున్న దేశం; నిరంకుశ జారిస్టు చక్రవర్తులు దేశంలో ప్రజాస్వామిక సంస్థలు వృద్ధి చెందకుండా అరికట్టారు. అలాంటి దేశంలో అంతకు పూర్వం ఏ సమాజంకూడా ఎదుర్కోని ఒకానొక గురుతర బాధ్యతను నిర్వర్తించవలసివచ్చింది. అంతకు పూర్వం వున్న సమాజాలన్నీకూడా వర్గాధిపత్యంపైన ఆధారపడిన సమాజాలే. తమ వర్గాధిపత్యాన్ని పటుతరమొనర్చుకొని, స్థిరీభూత మొనర్చాలన్న ఏకైక ధ్యేయంతో అంతకుపూర్వపు సమాజాలన్నీ పనిచేస్తూ వచ్చాయి. అక్టోబరు విప్లవం జయప్రదం కావటంతో, చరిత్రలో మొదటిసారిగా అధికారం శ్రామికప్రజల హస్తగతమైంది; ఆ విప్లవానికి సారథ్యం వహించినవారు గుణాత్మకమైన నూతన కర్తవ్యాన్ని నిర్వర్తించవలసివచ్చింది; కేవలం కార్మికవర్గ స్థానాన్ని పటుతర మొనర్చి, ఆర్థిక వ్యవస్థను నూతన ప్రాతిపదికపై నిర్మించే బాధ్యత మాత్రమే కాక, కమ్యూనిస్టు సమాజాన్ని—వర్గాలన్నీ అంతరించిపోయి, వాటితోపాటు రాజ్యాంగయంత్రమే అంతరించిపోయే సమాజాన్ని—నిర్మించటానికి అనువైన పరిస్థితులను సృష్టించవలసిన కర్తవ్యంకూడా వారిపై పడింది. అలాంటి ప్రయత్నం అంతకుముందెన్నడు ఎవరూకూడా తలపెట్టి వుండలేదు. ఈ విషయంలో అంతకుపూర్వం గల సమాజాల అనుభవంనుంచి నేర్చుకొనేందుకు అవకాశం ఏమాత్రం లేదు; స్వయంగా కష్టపడుతూ,

మార్గాలను వెదుకుకుంటూ ముందుకుపోవటం తప్ప మరో మార్గం లేదు.

పైగా, చరిత్రలో కనీవినీ ఎరుగని దుస్తర పరిస్థితులలో నూతన సమాజాన్ని నిర్మించవలసిన స్థితి ఏర్పడింది.

లెనిన్ తన సుప్రసిద్ధ "ఏప్రిల్ థీసిస్"లో ఒక విషయం స్పష్టం చేశారు. సకల అధికారాన్ని సోవియట్లపరం చేయాలని ఆయన ఉద్ఘాటించారు. శాంతియుత పద్ధతులలో విప్లవం కొనసాగగలదని ఆయన వూహించారు. అయితే, పాలకవర్గాలు దారుణమైన హత్యాకాండకు ఒడిగట్టటంతో, విధిలేక బోల్షివిక్కులు కూడా ఆయుధాలు చేబూనవలసివచ్చింది. అయినప్పటికీ, అక్టోబరు విప్లవం స్వల్పమైన హింసతోనే జయప్రదమైంది.

నూతన ప్రభుత్వం జర్మనీతో శాంతిసంధిని కుదుర్చుకొంది; ఆర్థికవ్యవస్థ పునరుద్ధరణకు ఉపక్రమించింది. అంతరంగిక శత్రువుల విషయంలో తొలుత చాలాకొద్ది విప్లవకర ప్రభుత్వాలు మాత్రమే చూపగల్గిన ఉదార వైఖరిని అవలంబించింది.

ఈ చారిత్రక సత్యాలను ఎవరూ కాదనజాలరు.

అటుతర్వాత జరిగిన దేమిటి ? దేశంలో లక్షలాది ప్రాణాలను బలిగొన్న అంతర్యుద్ధాన్ని తెచ్చిపెట్టిందెవరు ?

1918 ఆగస్టు 4 వ తేదీన మిత్రరాజ్యాలు సోవియట్ యూనియన్ సర్వాంసహాధికారాన్ని ఉల్లంఘిస్తూ, తమ సైనిక బలాలను ఆర్కేంగిల్స్ వద్ద దింపాయి; సోవియట్ ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు ఆ సైనిక బలాలు దేశంలోపల విప్లవ ప్రతీఘాతకులకు సహాయం చేయసాగాయి. బ్రిటిషు బలగాలు బాకూ నూనె గనుల కేంద్రాన్ని కైవసం చేసుకొన్నాయి. అటుతర్వాత కొన్నిరోజులకు, దురాక్రమణదారుల సైన్యాలు సైబీరియాలో ప్రవేశించాయి. విప్లవ ప్రతీఘాతకులు విదేశ సామ్రాజ్యవాదుల సహాయంతో తమ విచ్ఛిన్న కార్యకలాపాలను ఉధృతపర్చి, విజృంభించసాగారు. లెనిన్‌ని హత్యచేయటానికికూడా వారు వెనుదీయ

లేదు; వెంట్రుకవాసిలో లెనిన్ ప్రాణానికి ముప్పుతప్పింది. అంత కాండ జరిగిన తర్వాతనే నూతన ప్రభుత్వం శత్రువులపై తీవ్రమైన చర్యలు అమలుజరపటానికి ఉపక్రమించింది. ఆ సంక్లిష్ట దినాలలో మాస్కోలో బ్రిటిషు యుద్ధమంత్రివర్గ ప్రత్యేక ప్రతినిధిగావున్న బ్రూస్ లాక్ హార్ట్ కూడా ఈ విషయం అంగీకరించాడు.

1919 వేసవిలో బ్రిటను, ఫ్రాన్సు, జపాను దేశాల నాయకత్వాన 14 దేశాల సైనిక బలాలు చివరకు యుద్ధప్రకటన కూడా చేయకుండా, సోవియట్ యూనియన్‌పై దండెత్తాయి. ఆ బలగాలు సాగించిన కార్యకలాపాలను గురించి విన్‌స్టన్ చర్చిల్ "ప్రపంచ సంక్షోభం తదనంతరం" అన్న తన ప్రసిద్ధ గ్రంథంలో కళ్ళకు కట్టినట్లు ఎలా చిత్రించాడో చూడండి :

"వారికీ (మిత్రరాజ్యాలు) రష్యాకూ మధ్య యుద్ధం జరుగుతోందా అంటే, నిస్సందేహంగా లేదనే చెప్పాలి. అయినప్పటికీ, కంటికి కన్పించిన సోవియట్ రష్యన్లందరినీ వారు కాల్చిచంపారు; రష్యన్ భూభాగంపై దురాక్రమణదారులుగా వారు నిలబడ్డారు. సోవియట్ ప్రభుత్వంపై కత్తికట్టినవారందరికీ ఆయుధాలు సరఫరా చేశారు. రష్యా దీవులను దిగ్బంధనం చేశారు; రష్యా యుద్ధ నౌకలను నీటముంచారు. సోవియట్ ప్రభుత్వం పతనం కావాలని వారు మనసారా కాంక్షించారు; అందుకు పథకం పన్నారు. ఏమయినా అది యుద్ధమే! ఎంత సిగ్గుమాలిన జోక్యం! రష్యన్లు తమ వ్యవహారాలను ఎలా పరిష్కరించుకొన్నా తమకు లక్ష్యంలేదని వారు పదేపదే ఉద్ఘాటించారు. ఆహా! ఎంత నిష్పక్షపాతులు! పాపం శమించుగాక !"

[మైఖేల్ సాయర్స్, ఆల్బర్ట్‌ఖాన్‌లు తమ గ్రంథం "గ్రేట్ కాన్‌స్పిరెసీ ఎగెయిన్‌స్ట్ రష్యా"లో ఉల్లేఖించిన భాగం: పేజీ 130]

ఈ సైనిక జోక్యంవలన రష్యాలో అంతర్యుద్ధజ్వాలలు ప్రజ్వరిల్లాయి. దీనితో, అప్పటికే అస్తవ్యస్తమైపోయిన దేశ ఆర్థిక వ్యవస్థ మరింత ఛిన్నాభిన్నమైపోయింది. దేశంలో అంటువ్యాధులు

ప్రబలిపోయాయి; ఆకలి జ్వాలలు అలముకొన్నాయి. 30 మాసాలలో 7 కోట్లమంది నశించిపోయారు. దాదాపు 6000 కోట్ల పౌనుల విలువగల ఆస్తికి నష్టం సంభవించింది. ఆ మొత్తాన్ని తలచుకొంటేనే వళ్లు జలదరిస్తుంది. చివరకు 1928 అక్టోబరునాటికి — విప్లవానంతరం అయిదేళ్ళకు — సోవియట్ భూభాగంనుంచి దురాక్రమణదారులను నిశ్శేషంగా తుడిచిపెట్టగలిగారు.

దురాక్రమణదార్ల బలగం పరాజయం పొందిన తర్వాత, సోవియట్ ప్రజలు కాస్త ఊపిరి పీల్చుకోటానికి వీలుచిక్కింది. అయితే సోవియట్ యూనియన్‌పై కుట్రలు పన్నుతూ, దాని ఆర్థికవ్యవస్థను విచ్ఛిన్నపర్చటానికి ప్రయత్నాలింకా సాగించబడుతూనే వచ్చాయి. అంతేకాదు. తిరిగి సోవియట్ యూనియన్‌పై దండయాత్ర సాగించటానికి కూడా శత్రువర్గాలు ప్రయత్నించాయి. ఆకాలంలోనే సోవియట్ యూనియన్‌ని రెచ్చగొట్టాలన్న ఉద్దేశంతో ఆర్కాస్‌పై దాడి జరిపారు; బ్రిటిషు ప్రభుత్వం సోవియట్‌తో దౌత్యసంబంధా లన్నింటినీ తెగతెంపులు చేసుకొంది. ఆ దశలోనే పోలెండ్‌లోని సోవియట్ రాయబారిని హత్యచేశారు. దండయాత్రకు కొత్తపన్నాగాలు పన్నారు. అయితే సాపేక్షంగా చెప్పవలసివస్తే, ఆకొద్ది సంవత్సరాలలోను బయటనుంచి వచ్చిన ప్రమాదం అంత తీవ్రరూపం ధరించలేదు. విచ్ఛిన్నమైపోయిన తన ఆర్థికవ్యవస్థను పునరుద్ధరించుకొని, పునర్నిర్మించుకొనే కృషిలో సోవియట్ యూనియన్ నిమగ్నమైంది. సరిగా యీ దశలోనే సోషలిజాన్ని వ్యతిరేకిస్తున్న అంతర్గతశక్తులతో ప్రధానంగా సిద్ధాంతరీత్యా పోరాటం సాగించబడింది; అప్పట్లో నిర్బంధచర్యలకు గడంగిన ఉదంతాలు చాలా అరుదనే చెప్పాలి. చివరకు హంతకుడైన బోరిస్ సవింకోవ్ వంటి వానినికూడా 1924 లో అరెస్టు చేసినప్పుడు ఎంతో ఉదార వైఖరిని సోవియట్ ప్రభుత్వం అవలంబించింది. సోవియట్ విప్లవం ప్రారంభమైనప్పటినుంచికూడా సోవియట్ రాజ్యాన్ని ఎలాగైనా కూలద్రోయాలని కత్తికట్టి, విదేశీ

రాజ్యాల ప్రోద్బలంతో ప్రారంభమైన సాయుధ జోక్యంలో ప్రముఖ పాత్ర వహించిన వారిలో అతనొకడు. అంతేకాదు. లెనిన్‌ని హత్యచేయటానికి ఒడిగట్టిందికూడా అతనే. అలాంటి వానికి న్యాయస్థానంలో మరణశిక్ష విధించబడినా, దాక్షిణ్యదృష్టితో సోవియట్ ప్రభుత్వం ఆ మరణశిక్షను రద్దుచేసి, పదేళ్ళ ఖైదుశిక్ష అనుభవించితే సరిపోతుందని నిర్ణయించింది.

జపాను 1931 లో సామ్రాజ్యవాదుల నైతిక అండదండలతో చైనాపై దండయాత్ర ప్రారంభించింది జపానును సోవియట్ రష్యాపై పురికొల్పవచ్చునని సామ్రాజ్యవాదులు ఆశపడ్డారు. 1933 లో జర్మనీలో హిట్లర్ అధికారంలోకి వచ్చాడు. ఆ తరువాత కొద్దిరోజులకే రోమ్ - బెర్లిన్ కూటమి, తదనంతరం కొమింటర్న్ వ్యతిరేక కూటమి (రోమ్- బెర్లిన్ - టోకియో) ఏర్పడ్డాయి. ప్రపంచంలో సైనికంగా అత్యంత బలవత్తర రాజ్యాలైన ఆ మూడు దేశాల బలగాలు సోవియట్ రాజ్యంపై దాడి వెడలటానికి సన్నద్ధమై వున్నాయి. బ్రిటను, ఫ్రాన్సు దేశాలు, అమెరికాలోని దురాక్రమణశక్తులు చాటుమాటుగా ఆ మూడు రాజ్యాలను సోవియట్ రాజ్యంపైకి పురిగొల్పుతున్నాయి. సోవియట్ ప్రజలు కాస్త ఊపిరి పీల్చుకోటానికి వీలుచిక్కిన అదను కాస్తా ఆ విధంగా అంతమైపోయింది.

ప్రమాదం క్రమంగా ముంచెత్తుకు రాసాగింది. చివరకు అది రెండో ప్రపంచయుద్ధంగా పరిణమించింది. ఆయుద్ధం రాకుండా నివారించాలని సోవియట్ యూనియన్ ఎంతగానో ప్రయత్నించినప్పటికీ, ప్రయోజనం లేకపోయింది. 1941 లో హిట్లర్ జర్మనీ సోవియట్‌పై దండయాత్ర ప్రారంభించింది. ఫాసిస్టు దండయాత్రను నిలవరించేందుకు 80 లక్షలమంది సోవియట్ పౌరులు ఆత్మార్పణ చేయవలసి వచ్చింది. ఎట్టకేలకు నాజీలు పరాభూతులయ్యారు. నిజంగా ఫాసిస్టులే కనుక విజయమంది వుంటే, సోవియట్ యూనియన్, మొత్తం ప్రపంచం ఏమైపోయేవో వేరే చెప్పనక్కరలేదు.

చివరకు సంకులసమరం సాగుతున్న సమయంలో సైతం, సామ్రాజ్యవాదులు సోవియట్ యూనియన్‌ని ఎలాగైనాసరే దుర్బలపర్చి, ఉత్తరోత్తరా దానిపై దాడిచేయటానికి అనుకూల పరిస్థితులు సృష్టించుకోవాలని పడిన తాపత్రయం ఈసందర్భంలో గమనార్హం.

యుద్ధం ముగియగానే సోవియట్ ప్రజలు "అమ్మయ్యా, పీడ విరగడైంది" అనుకొన్నారు. అయితే ఆ పరిస్థితి ఎంతోకాలం కొనసాగలేదు. యుద్ధం ముగిసినతర్వాత ఆరునెల్లయినా గడవక మునుపే విన్‌స్టన్ చర్చిల్ యుద్ధంలో ప్రధానంగా అష్టకష్టాలు పాలైన సోవియట్ యూనియన్‌నుంచి యుద్ధప్రమాదం రానున్నదని తిరిగి ఒక గొప్ప "రహస్యం" కనిపెట్టాడు! వెంటనే బహుళ ప్రచారం పొందిన ఫుల్టన్ ప్రసంగం చేశాడు. "రష్యన్ కమ్యూనిజం నుంచి క్రైస్తవ నాగరికతకు మహాప్రమాదం రాబోతున్న"దనీ, ఆ ప్రమాదానికి వ్యతిరేకంగా అమెరికా, బ్రిటనులు సంఘటితం కావాలనీ ఆయన అమెరికన్ ప్రజలకు విజ్ఞప్తి చేశాడు.

ఈ సంగతులన్నీ అందరికీ తెలిసినవే. అయినప్పటికీ యింత వివరంగా ఎందుకు చెప్పవలసివచ్చిందంటే, సోవియట్ ప్రజలు అనేక సంవత్సరాలపాటు యుద్ధం ఏ క్షణాన వచ్చిపడుతుందో నన్న అసాధారణమైన ఆందోళనకర పరిస్థితులలో, ఉద్రిక్త వాతావరణంలో నివసించారని నిరూపించటానికే; వాటి ప్రాధాన్యతను నొక్కి-చెప్పటానికే.

## సోషలిజంకోసం జరిగిన పోరాటంలో స్టాలిన్ పాత్ర

ఇలాంటి విపత్కర అంతర్జాతీయ వాతారణంలో యుద్ధ ప్రమాద భీతావహంలో, సోవియట్ యూనియన్‌లో శత్రువర్గాల అవశేషాలను, ఆ వర్గాల మిత్రవర్గాన్ని ప్రతిఘటిస్తూ సోషలిస్టు వ్యవస్థను నిర్మించుకోవలసివచ్చింది. అసలే ఎంతో వెనుకబడిన ఆర్థిక వ్యవస్థతో ప్రారంభమైన సోవియట్‌రాజ్యం, అలాంటి పరిస్థితులలో

చావుబ్రతుకుల పోరాటం సాగిస్తూ, దేశాన్ని త్వరితంగా పారిశ్రామికవంతం చేసుకుంటూ, తన రాజకీయ, ఆర్థిక, సైనిక స్తోమతులను త్వరత్వరగా పెంపొందించుకొనవలసి వచ్చింది.

వాణిజ్య నిర్వాహకుల కర్తవ్యాలను నిర్వచిస్తూ జె. వి. స్టాలిన్ ఇలా స్పష్టంచేశారు :

“ఆర్థికంగా బాగా అభివృద్ధి చెందిన దేశాలకన్నా మనం యాభై లేక వంద సంవత్సరాలు వెనుకబడి యున్నాం. ఈ వ్యత్యాసాన్ని మనం పది సంవత్సరాలలోనే అధిగమించాలి. లేకపోతే శత్రువులు మనలను సర్వనాశనం చేస్తారు.

(జె. వి. స్టాలిన్, ప్రాబ్లమ్స్ ఆఫ్ లెనినిజం, 456 వ పేజీ)

1931 లో సోవియట్ యూనియన్‌పై హిట్లర్ దండయాత్ర పది సంవత్సరాలకు పూర్వం స్టాలిన్ ఆ మాటలు చెప్పారు.

అనేక సందర్భాలలో అధిగమించరానివిగా గోచరించిన అనేక అవాంతరాలను సోవియట్‌యూనియన్ అధిగమించి బలోపేతమైన పరిశ్రమలను నిర్మించుకొన్నది. వ్యవసాయరంగంలో సమిష్టిక్షేత్రాలు నెలకొల్పింది. నిరక్షరాస్యతను నిర్మూలించింది. సాంస్కృతిక రంగంలో దళితస్థితిని తొలగించింది. ప్రజల జీవన ప్రమాణాన్ని పెంపొందించింది. సోవియట్ యూనియన్‌లోగల వివిధ జాతుల (నేషన్స్) మధ్య, మానవ తెగల (రేసెస్) మధ్య స్నేహపూర్వకమైన సత్సంబంధాలను నెలకొల్పింది. జారు పాలన క్రింద పడి నలిగిపోయిన వివిధ జాతుల ఉద్ధరణకు, ఆర్థికాభివృద్ధి సాంస్కృతిక వికాసానికి, రాజకీయ జీవనాభివృద్ధికి అది తోడ్పడింది. ప్రతిదేశంతోను స్నేహ సంబంధాలను నెలకొల్పుకొనేందుకు కృషి చేసింది. ప్రతి దేశంయొక్క స్వాతంత్ర్య హక్కును అది బలపర్చింది. ఈ పనులన్నీ చేయటంద్వారా మొత్తం ప్రపంచంలోని ప్రగతిశీలురందరి ఆదరాభిమానాలను సోవియట్ చూరగొనగల్గింది. రవీంద్రనాథ్ టాగూర్, రోమారోలా, వెబ్ దంపతులు

ముఖ్యంగా ప్రముఖులు సోవియట్ యూనియన్‌లో జరిగిన అపూర్వ పరివర్తనను వేనోళ్ళ కొనియాడారు. ఒకనాడు "వివిధ జాతుల బందిఖానా"గా వున్న దేశం, అభివృద్ధినిరోధకశక్తులకు అలవాలమై యున్న దేశం నమ్మశక్యంకాని రీతిగా మారిపోయిందని వారంతా ప్రస్తుతించారు.

ఇలాంటి పరివర్తనను కొనిరావటానికి రూపొందించబడిన విధానాల విషయంలో నైతేనేమి, వాటిని అమలు జరపటంలో నైతేనేమి, సోషలిస్టు ఉత్పత్తిశక్తులను సమీకరించటంలో నైతే నేమి జె వి. స్టాలిన్ కొనియాడదగిన ప్రధానపాత్ర నిర్వర్తించారు; చాలకాలందాకా, ఆయన లెనిన్ ఉపదేశాల ప్రకారమే తు. చ. తప్పకుండా నడుచుకుంటూ వచ్చారు. స్టాలిన్ నిర్వహించినపాత్ర చరిత్రలో చిరస్థాయిగా వుండిపోతుంది; దానిని చెరపటం ఎవరి తరం కాదు. స్టాలిన్ గొప్ప మార్క్సిస్టు సిద్ధాంత వేత్త: అనన్యమైన, ప్రజ్ఞాధురీణుడైన నిర్మాత. ఎంతో జటిలమైన విషయాలను కూడా అందరికీ సులభ గ్రాహ్యమైన విధంగా వివరించి చెప్పగల దిట్ట. అలాంటివారు బహు అరుదుగా మాత్రమే వుంటారని చెప్పవచ్చు. స్టాలిన్ సారథ్యంలో, కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ నాయకత్వాన సోవియటు ప్రజానీకం మితవాద సంస్కరణ వాదులను, అతివాద ధోరణిగల వారిని సిద్ధాంత రీత్యాను, రాజకీయంగాను ఓడించారు; అలా ఓడించలేని పక్షంలో సోవియటు వ్యవస్థకు, సోషలిజానికి తప్పకుండా చేటు మూడి వుండేది. ఈ పోరాటంలో స్టాలిన్ తిరుగులేని పేరు ప్రతిష్ఠలను సంపాదించుకొన్నారు. తన సహచరులలోను, సోవియటు ప్రజలలోను ఆయన మాట సుగ్రీవాజ్ఞలా చలామణి అయ్యింది. అంతేకాక ప్రపంచంలోని కమ్యూనిస్టుపార్టీ లన్నింటినీ బోల్షివిక్ పార్టీలుగా తయారుచేసి, వాటిని రాటుతేర్చటంలోను, మార్క్సిజం – లెనినిజాన్ని యింకా అభివృద్ధి పర్చటంలోను ఆయన అమూల్యమైన సేవ చేశారు.

ఏది ఏమైనప్పటికీ, సాధింపబడ్డ విజయాలన్నింటికీ స్టాలిన్ వ్యక్తిగత నాయకత్వంలోగల అపూర్వ ప్రతిభావిశేషమే కారణమనటంగానీ, ఆయన ప్రజ్ఞాధురీణతే హేతువనటంగానీ మార్క్సిజం లెనినిజానికి పూర్తిగా వ్యతిరేకం. అంతేకాదు. సత్యదూరమైన సంగతికూడా. అలా చిత్రించటం ఎన్నో దుష్ఫలితాలకు దారితీసింది. వ్యక్తిగతంగా స్టాలిన్‌ను పూజించటానికీ, ఆయన ప్రతిపాదించిన ప్రతి సిద్ధాంతాన్ని గుడ్డిగా ఆమోదించటానికి అది కారణభూతమైంది. సమిష్టి నాయకత్వ పద్ధతులకు క్రమంగా స్వస్తి చెప్పటానికి అది దారి తీసింది.

1934 నాటికి, అంటే సోవియటు కమ్యూనిస్టుపార్టీ 17 వ మహాసభ జరిగిన నాటికి, ఒకప్రక్క సోషలిస్టు శక్తులకు, మరొక ప్రక్క అవశేషాలుగా మిగిలిన పెట్టుబడిదారీ శక్తులకు మధ్య సాగుతున్న నిర్ణయాత్మకమైన పోరాటం సమాప్తమైంది. సోషలిజం విజయవంతమైంది. దేశంలోగల పరిశ్రమలలో నూటికి 99 వంతులు సోషలిస్టు పరిశ్రమలుగా వున్నాయి. దేశంలో మొత్తం సాగవుతున్న భూమిలో నూటికి 90 వంతులు సోషలిస్టు వ్యవసాయ పద్ధతులలో - సమిష్టి, ప్రభుత్వ క్షేత్రాలుగా - సాగుచేయబడుతోంది. వాణిజ్య రంగంలో పెట్టుబడిదారీ శక్తులు నిర్మూలించబడ్డాయి. దోపిడీవర్గం అనేది లేకుండా తుడిచి పెట్టుకుపోయింది.

అయితే, ఆ దేసమయంలో బయటి ప్రమాదం మాత్రం లేకుండా పోలేదు. పైగా, జర్మనీలో హిట్లర్ అధికారంలోకి రావటంతో, ఆ ప్రమాదం మరింత హెచ్చింది. కొమింటర్న్ వ్యతిరేక ఒప్పందం కుదుర్చుకోవటంతో ఆముప్పు యింకాధికమైంది. సోవియట్ నాయకులు పరస్పర విరుద్ధ అంశాలతో కూడిన అత్యంత సంక్లిష్ట పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది.

సోవియట్ యూనియన్ చరిత్రలో అదొక అత్యంత విషమ దశ. అలాంటి పరిస్థితులలో సోవియట్ యూనియన్ స్వాతంత్ర్యాన్ని కాపాడటం ఎలా అన్న సమస్య ప్రత్యక్షమైంది. విజయ

వంతమైన సోషలిజాన్ని సంరక్షిస్తూ, సోషలిస్టు వ్యవస్థను పటిష్ఠ వంతం చేసుకొంటూ, ప్రజల మనస్సులలో నుంచి పెట్టుబడిదారీ అవశేషాలను తుడిచి వేయట మెట్లా అన్న సమస్య ఆనాడు ఉత్పన్నమైంది.

## తప్పు సిద్ధాంతం : దాని దుష్ఫలితాలు

ఈ సమస్యలను పరిష్కరించటంలో స్టాలిన్ తీవ్రమయిన పొరపాట్లు చేశారు. సోషలిస్టు పథంలో యింకా ముందుకుపోయే కొలదీ వర్గపోరాటం తీవ్రతర మవుతుందన్న సూత్రీకరణ నొకదానిని ఆయన ప్రతిపాదించారు; సోషలిస్టు వ్యవస్థ సుస్థిరమవు తున్నకొలదీ ప్రపంచ పెట్టుబడిదారులకు గంగ వెర్రులెత్తుతాయనీ, తత్ఫలితంగా వారు సోషలిస్టు ప్రభుత్వాన్ని కూలద్రోయటానికి తెగించి వ్యవహరిస్తారనీ ఆయన వాదించారు; సోవియట్ యూని యన్‌లోని పూర్వపు శత్రువర్గాలకు చెందిన అవశేషశక్తులూ పతనం చెందినవ్యక్తులూ ప్రపంచ పెట్టుబడిదారులకు తాబేదార్లుగా పని చేస్తారనికూడా ఆయన వాదించారు. అందుచేత సోషలిజం గొప్ప విజయాలను సాధించేకొలదీ వర్గపోరాటం తీవ్రతరమవుతుం దని ఆయన నిర్వచించారు.

బయటనుంచి సోవియటు యూనియన్‌కు ప్రమాదం ముంచు కొస్తోంది; దేశంలో కొన్ని దుష్టశక్తులు సోవియట్ ఆర్థిక వ్యవస్థను దెబ్బతీయటానికి యత్నిస్తున్నాయి; ఆ దుష్టశక్తులకూ విదేశాలలోని శత్రు వర్గాలకూ సంబంధాలుకూడా వున్నాయి. ఫాసిస్టు, సామ్రాజ్యవాదరాజ్యాల ఏజెంట్లు సాగిస్తున్న గూఢచార చర్యలు, తదితర విద్రోహచర్యలు పెచ్చుపెరుగుతున్నాయి. వీటన్నిటి దృష్ట్యా స్టాలిన్ రూపొందించిన సిద్ధాంతం సరియైనదిగానే పైకి కన్పించింది. పైగా, అప్పటికే మహత్తరమైన పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న, సాధికారియైన స్టాలిన్‌వంటి వ్యక్తి ఆ సిద్ధాం తాన్ని రూపొందించారు.

అయితే ఈ సిద్ధాంతం కేవలం అర్ధసత్యాన్ని మాత్రమే వ్యక్తంచేస్తోంది. విదేశ శత్రువులను కడు జాగరూకతతో ఒక కంట కనిపెట్టుతూ వుండటమూ, రక్షణబలాలను బలవత్తర మొనర్చుకోవటమూ ఎంతో అవసరమైనమాట నిజమే. దేశంలో యింకా శత్రువులు కలరన్న విషయమూ, సామ్రాజ్యవాదుల సహాయంకోసం వారు ఎదురుచూస్తున్న సంగతీ కూడ వాస్తవమే. ఆంతరంగిక శత్రువులను రూపుమాపవలసిందే. ఆంతరంగిక విషయాలలోకూడా బలప్రయోగాన్ని పూర్తిగా విసర్జించటం శక్యం కాదు. అయితే, సోవియట్ యూనియన్‌లో సోషలిజానికి వ్యతిరేకులుగావున్న శక్తులకు సామాజిక పునాదులనేవి దాదాపు లేకుండా పోయాయన్న వాస్తవాన్నికూడా మనం గుర్తించుకోవాలి. వర్గాలనేవి రద్దయిపోయిన తర్వాత వ్యక్తుల మనస్సులలో యింకా మిగిలియున్న పెట్టుబడిదారీ భావాల అవశేషాలను ప్రధానంగా సిద్ధాంతరంగంలో మాత్రమే ఓడించవలసియుంటుంది; ఆ అవశేషాలకు వ్యతిరేకంగా సాగించే పోరాటంలో ప్రధానంగా నచ్చజెప్పి ఒప్పించే పద్ధతులను, నైతికమైన ఒత్తిడి తెచ్చి ఒప్పించే పద్ధతులను, ప్రత్యక్షమైన ఉదాహరణలు చూపి నచ్చజెప్పే పద్ధతులను అవలంబించాలి.

వర్గాలు రద్దయిపోయిన తర్వాతకూడా, సోషలిజం ప్రవర్ధమానమవుతూ బలవత్తరమవుతున్నకొలదీ వర్గపోరాటం తీవ్రతరమవుతుందన్న సిద్ధాంతం పూర్తిగా తప్పు సిద్ధాంతం. వాస్తవిక విషయాలకు ఆ సిద్ధాంతం పూర్తిగా వ్యతిరేకమైనది. సోవియట్ యూనియన్ చుట్టూ సోషలిస్టు వ్యవస్థను నాశనంచేయాలని కాచుకొని కూర్చున్న శత్రురాజ్యాలు ఉన్నమాట నిజమే. అందుచేత ఏమాత్రం ఉపేక్షాభావానికి లోనుకాకుండా, యింటా బయటా రక్షణలను కట్టుదిట్టం చేయవలసిన అవసరం ఉన్నమాటా నిజమే. అయితే, అంతమాత్రాన సోషలిస్టు వ్యవస్థ ప్రవర్ధమానమవుతూ, సుస్థిరమవుతున్నకొలదీ దాని ఆర్థిక, రాజకీయ, నైతిక

శక్తి యినుమడిస్తుందన్న విషయం సత్యం కాకుండా పోదు; కనుక దేశంలోపల ప్రజాస్వామిక హక్కులను విస్తరింపచేయటానికి అవకాశం వుంటుంది. మనం యింగితజ్ఞానంవల్ల నేర్చుకోవలసిన విషయం యిదే. మార్క్సిజం – లెనినిజంయొక్క బోధనలకుకూడా యిది పూర్తిగా అనుగుణ్యమైనది.

సంపూర్ణ సత్యంలోని ఈ అంశాలన్నింటికీ తగినంత విలువ యివ్వబడలేదు. బయటినుంచి యితోధికమవుతున్న ప్రమాదమూ, దేశంలో పెచ్చుపెరుగుతున్న శత్రు చర్యలూ, చివరకు 1935లో సెర్జీకిరోవ్ హత్యకావించబడటం, అనేక విద్రోహచర్యలు జరగటం —— ఇలాంటి పరిస్థితులలో వర్గ పోరాటం తీవ్రతరమవుతుందన్న సిద్ధాంతం రూపొందించబడి, పెంపొందించబడింది. దానితో కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ సమాజం, సోవియట్ రాజ్యం అనేక విషమ ఫలితాలకు లోనుగాజొచ్చాయి.

విమర్శించేవారినీ, వ్యతిరేకించేవారినీ ప్రజాశత్రువులుగా చిత్రించే ధోరణి ఈ సిద్ధాంతంనుంచే పుట్టింది. శిక్షించబడినవారిలో హెచ్చుమంది నిజంగా దోషులే; వారు పూర్తిగా శిక్షార్హులే. అయితే వారితోపాటు అనేకమంది నిరపరాధులు, అమాయకులు కూడా అనవసర శిక్షలకు గురిచేయబడ్డారు. విప్లవ ప్రతీఘాతకులకు వ్యతిరేకంగా సాగిన పోరాటంలో గొప్పసేవచేసిన భద్రతా శాఖలు (సెక్యూరిటీ సర్వీసెస్) రానురాను అపరిమితాధికారాలను చేజిక్కించుకొని, అందలమెక్కి కూర్చున్నాయి. యగోడా, యఝోవ్, అందరికంటే ముఖ్యంగా బెరియా వంటివారు ఈ అవకాశాన్ని దుష్టబుద్ధితో స్వార్థంకోసం వినియోగించుకొన్నారు. సోషలిస్టు నిర్మాణంలో ప్రత్యక్షమైన సాధకబాధకాలన్నింటికీ కారణం విప్లవ ప్రతీఘాతకుల కుట్రలేనన్న ధోరణి ప్రబలింది; అనేక సందర్భాలలో విప్లవ ప్రతీఘాతకుల చర్యలే అందుకు కారణం అనటంలో సందేహంలేదుకాని, అన్ని విషయాలలోనూ వారి చర్యలే మూలమనటం మాత్రం వాస్తవంకాదు.

వ్యక్తి పూజవల్ల ప్రజాస్వామ్యానికి విఘాతం కల్గింది. ప్రజాస్వామ్యం పరిమితమైపోవటంతో ఆ వ్యక్తిపూజ మరింతగా వృద్ధి చెందింది.

స్టాలిన్‌లో అనన్యమైన శక్తి సామర్థ్యాలున్నమాట నిజమే. అయినంతమాత్రాన ఆయన అసలు తప్పులే చేయదన్న విశ్వాసం కేవలం అంధ విశ్వాసం మాత్రమే. వ్యక్తిపూజగానీ, స్టాలిన్ ఎన్నడూ తప్పులు చేయడన్న భావంగానీ పూర్తిగా అశాస్త్రీయమైనవి; వాటివల్ల ఎన్నో అనర్థకాలు దాపురించాయి. సోషలిస్టు నిర్మాణం విషయంలోనైతేనేమి, శ్రామికేతర వర్గాలతోను శక్తులతోను సంబంధాలు పెట్టుకొనే విషయంలోనైతేనేమి అవి పిడివాదానికి, పడికట్టు సూత్రాలకు బలమిచ్చాయి; మార్క్సిజానికి పూర్తిగా విరుద్ధమైన సంకుచిత ఆలోచనాధోరణికి అవి కారణభూతమయ్యాయి. దానివల్ల ఒక్క సోవియట్ కమ్యూనిస్టుపార్టీయే కాక, ఇతర కమ్యూనిస్టు పార్టీలుకూడా ఎంతో కొంత నష్టపడ్డాయి.

1948 తర్వాత యుగోస్లావియా విషయంలోను, యుగోస్లావ్ కమ్యూనిస్టుల విషయంలోను అవలంబింపబడిన వైఖరి ఏ విధంగాను సమర్థనీయం కాదు. యుగోస్లావియా కమ్యూనిస్టులు చేసిన పొరపాట్లు ఎలాంటివైనా కావచ్చు; వారి సిద్ధాంతాలూ, ఆచరణా రాజకీయంగాను, సిద్ధాంత రీత్యాను విమర్శించ దగినవే కావచ్చు; అయినా, మార్షల్ టిటోపై సాగించిననిందా ప్రచారంమాత్రం పూర్తిగా నిర్హేతుకమైనదనీ, నిరాధారమైనదనీ చరిత్ర నిరూపించింది. ఇంతకంటే దారుణమైన సంగతి మరొకటి వుంది. తూర్పు యూరపు నూతన ప్రజాతంత్ర దేశాలలోని కమ్యూనిస్టు నాయకులపై లేనిపోని విద్రోహ నేరాలు ఆరోపించి, వారిని శిక్షించారు; వారిలో కొందరిని ఉరికంబాలకు ఎక్కించారు.

వీటన్నిటివల్ల సోషలిస్టు ఆశయానికి తీరని అపచారం జరిగింది; ఈ అపచారాన్ని తక్కువ అంచనా వేయరాదు.

ఈ పరిణామా లన్నింటికీ, అందరికంటె ముఖ్యంగా స్టాలినే బాధ్యుడు. సాధించిన విజయాలతో ఆయనకు అహంభావం అలవడింది; విజయగర్వం పెరిగింది. ఆయనలో స్వతఃసిద్ధంగా వున్న కొన్ని అవగుణాలు వృద్ధిచెంది, రానురాను తీవ్రరూపం ధరించాయి.

ప్రగతిశీలమైన చారిత్రక శక్తులకు సరిగా ప్రాతినిధ్యంవహిం చటంద్వారా విప్లవోద్యమ నాయకులు గొప్పస్థానం అలంకరిస్తారు; అయితే, ఆ పాత్ర వహించేటప్పుడు ఆ నాయకులు ఒకానొకప్పుడు పరిస్థితులలో ఒక ముఖ్యాంశంగా ఉంటారు. అలాంటి పరిస్థితులలో వారి వ్యక్తిగత పాత్ర, సుగుణాలు, అవగుణాలు ఉద్యమగతిని త్వరితం చేయటానికిగానీ, మందగింపచేయటానికిగానీ కారణ భూతమై తీరుతాయి. వ్యక్తిపూజవల్ల సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు వ్యవస్థ మూలస్వభావం మారలేదని నిక్కచ్చిగా చెప్పవచ్చు. ఎందుచేతంటే, సోవియట్ సమాజ వర్గస్వభావం అప్పటికే ఎంతో బలీయంగా వేరూనివుంది. దీనినిగురించి ముందు ముందు మరికొంత వివరంగా చర్చిద్దాం. ఇంతకీ చెప్పొచ్చే దేమి టంటే, వ్యక్తిపూజవల్ల తీవ్రమైన ఎన్నో అతిక్రమణలు, పొర పాట్లు జరిగాయి.

అదే సమయంలో మనం మరొక విషయంకూడా గుర్తుంచు కోవాలి. కేవలం ఆనాటి చారిత్రక పరిస్థితులవల్ల, స్టాలిన్‌లోగల వ్యక్తిగత లోపాలవల్ల మాత్రమే సోవియట్ యూనియన్‌లో వ్యక్తి పూజ వృద్ధిచెందిందనటం సహేతుకమైన విషయంకాదు. వ్యక్తి పూజ వృద్ధిచెందటానికి ఇతర సోవియట్ కమ్యూనిస్టు నాయ కులుకూడా కొంతవరకు బాధ్యులేనని చెప్పవలసివుంటుంది. వ్యక్తి పూజకు వ్యతిరేకంగా గట్టిపోరాటం సాగించటానికి 1935 అనంతరం అసలు ఎప్పుడూ అవకాశం చిక్కనే లేదనటం నమ్మశక్యంకాని విషయం. అసలు అలాంటి పోరాటాన్ని సాగించవలసిన అవస రాన్ని చాలకాలందాకా ఎవరూ గుర్తించినట్లే కన్పించదు. సోవియట్ యూనియన్‌లో సోషలిజం ఘనతరమైన విజయాలు

సాధించింది; ఆ విజయాల సాధనకు మూలమైన విధానాలను ప్రధానంగా రూపొందించిన వ్యక్తి స్టాలిన్. అందుచేత ఇతర నాయకులపై దీని ప్రభావం చాలకాలం పనిచేస్తూ వచ్చింది. స్టాలిన్ ప్రముఖ మార్క్సిస్టు సిద్ధాంతివేత్త; మేటి నిర్మాత; కమ్యూనిజానికి వ్యతిరేకమైన పెడధోరణులను గట్టిగా ఎదిర్చిన దిట్ట; చక్కని వాదనాపటిమగల వ్యక్తి; తన మాటకు తిరుగు లేదనిపించుని, గొప్పపేరు ప్రతిష్టలు సంపాదించుకొన్న నాయకుడు. ఈ విషయాలన్నింటినీ దృష్టిలో వుంచుకొని ఇతర నాయకులు ఆయనపట్ల తమ వైఖరిని నిర్ణయించుకొన్నారు. వ్యక్తి పూజ ప్రభావానికి వారంతా లోనైనవారే. అంతేకాక, తామే స్టాలిన్‌ను పూజించటం ద్వారా వ్యక్తి పూజ వృద్ధిచెందటానికి తోడ్పడ్డారు.

స్టాలిన్ చనిపోయే క్షణందాకా ఆయన కార్మికవర్గం పట్ల, సోషలిజంపట్ల భక్తి ప్రపత్తులతో వ్యవహరించారు. అయితే ఏయే సుగుణాలైతే ఆయన పేరు ప్రతిష్టలకు, గొప్పతనానికి కారణ భూతమయ్యాయో, అవే చివరకు-ముఖ్యంగా ఆయన జీవిత అంతిమ దశలో-క్రమంగా అవలక్షణాలుగా పరివర్తన చెందసాగాయి. మితిమీరిన అప్రమత్తత లేనిపోని అనుమానంగాను, స్థిర సంకల్పం మొండిపట్టుదలగాను, సంకల్పబలిమి నిరంకుశత్వంగాను, ఆత్మవిశ్వాసం యితరుల అభిప్రాయాలను తూష్ణీ భావంతో త్రోసిపారేసే అలవాటుగాను, విమర్శను సహించలేక పోవటంగాను-పరిణమించాయి. అత్యుత్తమ విప్లవనాయకులలో ఒకరైన స్టాలిన్ జీవిత దుర్దశకు హేతువు అదే. ఇది అంతా కలకాలం గుర్తుంచుకోదగ్గ గుణపాఠం.

## కమ్యూనిస్టులు సోవియట్ రష్యాను ఎందుకు సమర్థిస్తారు?

"అయితే మీ విషయ మేమిటి? సోవియట్ యూనియన్‌లో జరిగిన ఘోరకృత్యాలను మీ రెందుకు ఖండించ లేదు?

సోవియట్‌యూనియన్‌ని గురించిన విమర్శనలన్నింటినీ సోషలిజానికి వ్యతిరేకంగా సాగించబడే నిందాప్రచారమంటూ మీరెందుచేత కొట్టిపారేశారు? సోవియట్ నాయకులవలెనే మీరుకూడా స్టాలిన్‌ని ఎందుకు తెగపొగడుతూవచ్చారు ?" అని మమ్మలను, కమ్యూనిస్టు పార్టీ నాయకులను ప్రజలు న్యాయంగానే ప్రశ్నించవచ్చు.

ఈ ప్రశ్నలకు మా వ్యతిరేకు లిచ్చే సాధారణ సమాధానం ఒకటుంది: కమ్యూనిస్టులు కళ్లుమూసుకొని సోవియట్ యూనియన్‌ని బలపర్చుతారు కనుకనే అలా జరిగిందని అంటారు వారు. అలాంటి సమాధానం వారికీ, వారి స్నేహితులకూ సంతృప్తికరంగా ఉండవచ్చు కాని, అది వాస్తవాన్ని మాత్రం వ్యక్తం చేయదు. ప్రపంచంలోని అన్ని దేశాలలోగల కమ్యూనిస్టులు సోషలిజంకోసంజరిగే సమరంలో అగ్రశ్రేణిలో నిలబడి, తాము నమ్మిన ఆశయాలకోసం వీరోచితంగాను, అచంచలంగాను తుదిదాకా నిలబడి పోరాడుతున్నారే! అలా పోరాడుతున్న యోధులు తమ పార్టీ లోనూ వున్నారని చెప్పుకోగల సాహసం మరి యే యితరపార్టీకి కూడా లేదే! మరి అలాంటి కమ్యూనిస్టులు ఒక్క సోవియట్ యూనియన్ విషయంలోనే అలా ఎందుకు వ్యవహరించారు. అన్న విషయాన్ని ఆ సమాధానం సరిగా వివరించటంలేదు.

ప్రపంచంలో మొట్టమొదటిసారిగా సోవియట్‌యూనియన్‌లో అధికారం శ్రామిక ప్రజల హస్తగతమైంది. వారెన్నో కష్టనష్టాలకు లోనవుతూ నూతన సమాజం నిర్మించారు. సామాన్య ప్రజలు, కార్మికులు, కర్షకులు, శ్రమజీవులు రాజ్యాంగ వ్యవహారాలను నిర్వహించగల్గిన సమర్థులని తొలుత ఆదేశం నిరూపించింది. భూస్వాములు, పెట్టుబడిదారులు, ఉన్నత వర్గాలవారని పిలవబడే వారు మాత్రమే రాజ్యాంగ వ్యవహారాలను నిర్వహించాలని ఎక్కడా రాసిపెట్టలేదని నిరూపించినదికూడా ఆ దేశమే. వర్గాలను పూర్తిగా రద్దుచేయటం సాధ్యమనీ, అవి రద్దవటమంటే అరాజకం ప్రబలటం కానేకాదనీ, అవి రద్దయితే సర్వతోముఖాభి

వృద్ధికి అనువైన పరిస్థితు లేర్పడతాయనీ, ఆర్థిక సంక్షోభాల పీడ, నిరుద్యోగబాధ విరగడైపోతుందనీ నిరూపించిన దేశంకూడా అదే. అనేక దేశాలలో అనేక సంవత్సరాలపాటు సోషల్ డెమోక్రట్లు అధికారంలో వున్నప్పటికీ, వారు పెట్టుబడిదారీ ఆస్తి సంబంధాలను ఏమాత్రం మార్పుచేయ లేకపోయారు. చివరకు జర్మనీ, ఆస్ట్రియా వంటి దేశాలలో ఫాసిజం తలెత్తకుండా అరికట్ట లేకపోయారు. పెట్టుబడిదారీ విధానంకన్నా సోషలిజం ఉత్కృష్టమైనదని నిరూపించి, ప్రపంచ జనాభాలో మూడోవంతు సోషలిస్టు మార్గంలో పురోగమించటానికి వీలుకల్పించిన దేశం సోవియట్ యూనియన్. సకల దేశాల స్వాతంత్ర్యంకోసం, సర్వాంగసహాభివృద్ధి కారంకోసం సాగుతున్న పోరాటంలో అది ముందుండి పోరాడుతోంది. ప్రపంచ శాంతికి శ్రీరామరక్షగా ఆ దేశం నిలబడుతోంది. అలాంటి పరిస్థితులలో కార్మికవర్గంలోని అగ్రగాములంతా సోవియట్ యూనియన్‌కు అండగా నిలబడి, శత్రువులు సాగించే దుష్ప్రచారాన్ని ఖండించటం తమ విధ్యుక్తధర్మంగా ఎంచుకొన్నారు. *

---

* సోవియట్ యూనియన్‌కు అండగా నిలబడి, దానిని బలపర్చింది కేవలం కమ్యూనిస్టులు మాత్రమే కాదు. భారతదేశంతో సహా అన్ని దేశాలలోని నిజాయితీపరులైన సోషలిస్టులు, సోవియట్ సమాజంలోని అనేక అంశాలతో తాము ఏకీభవించలేకపోతున్నా, సోవియట్ సమాజం సాధించిన చరిత్రాత్మక విజయాలను గుర్తించారు; ఈ విజయాల ప్రభావం మానవుల మనస్సులపై ఎంత బలీయంగా ప్రసరించిందో వారు గమనించారు; సోవియట్ యూనియన్‌నుంచి గుణపాఠాలను గ్రహించారు. 1934 మే మాసంలో జరిగిన అఖిలభారత సోషలిస్టుపార్టీ ప్రథమ మహాసభను ప్రారంభిస్తూ కీ. శే. ఆచార్య నరేంద్రదేవ్ ఇలా నుడివారు:

"అది (సోషలిజం) ఇంకెంతమాత్రం సిద్ధాంతాంశం మాత్రమే కాదు; కనీసం ఒక దేశంలోనైనా అదిప్పుడు ఆచరణ రూపం ధరిస్తోంది. రష్యన్ ప్రయోగం మన కళ్లెదుటే జరిగిపోతోంది. ఆ ప్రయోగాన్ని మనం పరిశీలించి, మనంతట మనం సొంత నిర్ణయాలకు రావచ్చు. సోవియట్ యూనియన్‌లో

పోరపాట్లు జరిగినప్పటికీ, గత 39 సంవత్సరాలలోను సోషలిస్టు, ప్రజాస్వామిక, శాంతిశక్తులుసాధించిన అపూర్వమైన పురోభివృద్ధిని మాత్రం ఎవరూ కాదనజాలరు; ఇంతటి పురోభివృద్ధి సోవియట్‌యూనియన్ నిర్వహించిన పాత్రవల్లనే సాధ్యమైందన్న వాస్తవాన్ని కూడా ఎవరూ నిరాకరించలేరు. అక్టోబరు విప్లవం మొట్టమొదటిసారిగాఅధికారాన్ని శ్రామికప్రజల హస్తగతంచేసింది. దానితో మానవజాతి చరిత్రలోనే నూతనశకం ప్రారంభమైంది.

---

అసలు జరుపబడుతున్న ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థలోగల గొప్ప సుగుణాలను పెట్టుబడిదారులుకూడా అంగీకరిస్తున్నారు; అంతేకాదు; రష్యానుంచి ప్రణాళికాబద్ధ ఆర్థిక వ్యవస్థ అన్న భావాన్ని ఎరువుతెచ్చుకొని, తమ పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థలో అమలుజరపాలనికూడా వారు చూస్తున్నారు. ఆ దేశంలో ఫ్యాక్టరీలను, పంట పొలాలను, రవాణా మార్గాలను, ఋణాలిచ్చే సంస్థలను (క్రెడిట్ సిస్టమ్) సమాజపరం కావించారు; వ్యవసాయరంగంలో సమిష్టి క్షేత్రాల పద్ధతిని యిప్పుడిప్పుడే అమలు జరుపుతున్నారు. అరాజకానికి బదులు ఆర్థికాభివృద్ధి ప్రణాళికాబద్ధంగా సాధించబడటం మనం చూస్తున్నాం. సోషలిస్టు ఆర్థిక వ్యవస్థకు గట్టి పునాదులు పడ్డాయి. ఉత్పత్తి స్థాయి క్రమంగా వృద్ధిచెందుతోంది. దానితోపాటు ప్రజల జీవన ప్రమాణం నిరంతరం పెరుగుతోంది. మొదటి పంచవర్ష ప్రణాళిక అపూర్వంగా విజయవంతమైంది. రెండో పంచవర్ష ప్రణాళిక యిప్పుడు అమలుజరుపబడుతోంది.

"తనపై కత్తికట్టిన దేశాల వక్రబంధంలో సోవియట్ యూనియన్ యిరుక్కొనివుంది; పైగా మిగతా ప్రపంచమంతటా ఆర్థిక సంక్షోభపు జ్వాలలు అలముకొనివున్నాయి; అయినప్పటికీ ఆ దేశం త్వరితంగా అభివృద్ధి సాధిస్తోంది. సోవియట్ యూనియన్‌ను చూసి నేర్చుకోవలసివుందని చెప్పటానికి యింతకన్నా వేరే తార్కాణం కావాలా ? సోవియట్ యూనియన్ గడచి గట్టెక్కిన దశలన్నింటినీ మిగతా దేశాలన్నీ కూడా నడిచిపోవలసిన అవసరంలేదు. అలాగే సోవియట్ ప్రణాళికలలోని ప్రతి అంశాన్ని మనం అనుకరించవలసిన అవసరమూ లేదు. ఆయా దేశాలలోవుండే ప్రత్యేక పరిస్థితులను బట్టి విధానాలను రూపొందించుకోవలసివుంటుంది. అయితే సోషలిస్టు ప్రయోగానికి ఉపక్రమించేవారంతా సోవియట్ ప్రయోగంనుంచి నేర్చుకోవలసింది మాత్రం చాలావుంది. ఆవిధంగా సోవియట్ ప్రయోగం ఇతరుల పనిని సుకరంచేసిపెట్టింది."

(సోషలిజం - జాతీయ విప్లవం : పేజీ 18, 19)

తత్కారణంగానే శ్రామిక ప్రజలంతా దీనిని కలకాలం స్మరించుకుంటూ వుంటారు. సోవియట్ యూనియన్‌ని సమర్థించటమంటే, సోషలిజాన్ని, మానవాభ్యుదయాన్ని, దేశదేశాల ప్రజల స్నేహాన్ని, శాంతి, స్వాతంత్ర్యాలను సమర్థించటమన్న మాటే.

దీనితోపాటు మరొక విషయాన్ని కూడా గుర్తుంచుకోవాలి. బూర్జువావర్గం సందుదొరికినప్పుడల్లా సోవియట్‌పై దుష్ప్రచారం చేస్తూ వచ్చింది. అక్టోబరు విప్లవం ప్రారంభమైన తొలిరోజులలో, రష్యాలో స్త్రీలందరినీ సమాజపర మొనర్చారనీ, చివరకు బోల్షివిక్‌లు నరభక్షకులుగా ప్రవర్తిస్తున్నారనీ దుష్ప్రచారం సాగించారు. అటు తర్వాత పంచవర్ష ప్రణాళిక పూర్తిగా విఫలమై పోయిందనీ, సోవియట్ ఆర్థికవ్యవస్థ విచ్ఛిన్నమై పోయే స్థితిలో వున్నదనీ, లక్షలాదిజనులు కరువు కాటకాలతో అలమటించి పోతున్నారనీ, సోవియట్ యూనియన్ 'పేకముక్కలమేడ' వంటిదనీ ప్రచారంచేశారు. సోవియట్ యూనియన్ సామ్రాజ్యవాద దేశంగా మారిందనీ, ప్రపంచాన్ని విభజించి పంచుకొనే నిమిత్తం నాజీ జర్మనీతో రహస్య ఒప్పందం కుదుర్చుకొన్నదనీ, ఇత్యాది అబద్ధాలెన్నో ప్రచారంలోకి వచ్చాయి.

ఈ విషయాలన్నింటిలోను సోవియట్ శత్రువులు చేసిన ప్రచారం కేవలం అభూత కల్పనలని తేలిపోయింది. మరొకవైపు వీటిని గురించి సోవియట్ నాయకులు చెప్పినదే సరియైనదని కూడా రుజువైంది. అయినప్పుడు, అలాంటి పరిస్థితులలో సోవియట్ యూనియన్‌ను విమర్శించే వారి మాటకన్నా, సోవియట్ నాయకుల ప్రకటనలకే కమ్యూనిస్టులు ఎక్కువ ప్రాధాన్యమిచ్చారంటే, అందులో ఆశ్చర్యపడవలసిందేమిటి ? పైగా సోవియట్‌ను విమర్శిస్తున్నవారిలో అత్యధికులు సోషలిజం అంటే ద్వేషించేవారే.

అయితే మా పార్టీలోను, ఇతర కమ్యూనిస్టు పార్టీలలోను ప్రతిదానికీ సోవియట్ యూనియన్‌ను ఆదర్శంగా తీసుకొనే ధోరణి ప్రబలినమాట నిజమే. సోవియట్ యూనియన్ అనుసరించిన విధా

నాలను, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ చర్యలను, పద్ధతులను గుడ్డిగా సమర్థించేధోరణి ప్రబలిన మాటకూడా వాస్తవమే. అంతే కాదు. ఎవరైనా సోవియట్ జీవితంలోని ఏదో ఒక అంశాన్ని విమర్శించితే, వారందరూ సోషలిజానికి వ్యతిరేకులని ముద్రవేసే ధోరణీ, అలాంటి విషయంలో అసహనంతో కూడిన శత్రువైఖరీ కూడప్రబలింది. దీనివల్లనిజాయితీ పరులైనఅనేకమందిని దూరంచేసు కొన్నాం. సోషలిస్టు, ప్రజాస్వామిక శక్తులన్నింటినీ ఏకత్రాటిపై సమీకరించటానికి అనేక అవరోధమై కూర్చొంది. సోషలిస్టు ఆశయానికీ, సోవియట్ సమాజానికీ ఆ ధోరణి చాలాహానిచేసింది. అందుచేత ఆ ధోరణిని వెంటనే విడనాడాలి.

అయితే, మేమూ యితర కమ్యూనిస్టుపార్టీలవారూ ఒకపని చేసివుండవలసింది; సోవియట్‌లో వాస్తవంగా జరుగుతున్న పొరపా ట్లేమిటో తెలియకపోయినప్పటికీ, ఒక వ్యక్తిని మితిమీరి పొగడు తున్నందుకు నిరసన వ్యక్తంచేసివుండవలసింది. ఎందుకంటే అలా పొగడటం మార్క్సిజం - లెనినిజానికే పూర్తిగా విరుద్ధం. ఆ పని మేము చేయలేదు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంతో పాటు, స్టాలిన్ వ్యక్తిపూజ పెరగటానికి మేమూ, యితర కమ్యూ నిస్టు పార్టీలవారూ కూడా కొంతవరకు బాధ్యులమే.

## సాధించిన విజయాలు పొరపాట్లను కప్పివేశాయి!

పొరపాట్లను యింతకుముందే ఎందుకు సరిదిద్దలేదు? అవి యింత దీర్ఘకాలం ఎందుకు కొనసాగవలసివచ్చింది?

పైకి విచిత్రంగానే కన్పించవచ్చుగాని, దీని కంతటికీ ముఖ్య కారణం మాత్రం సాధించిన అద్వితీయ విజయాలేనని చెప్పవలసి వుంటుంది. మొత్తంమీద సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అమలు జరిపిన విధానాలు ప్రధానంగా సవ్యమైనవి; వాటిని ప్రజలు పూర్తిగా బలపరుస్తూవచ్చారు. విదేశీ సహాయం ఏమాత్రం లేకుండా, దళితస్థితిలోవున్న దేశాన్ని ప్రపంచంలో పారిశ్రామికంగా

బాగా అభివృద్ధిచెందిన దేశాలలో ద్వితీయస్థానం ఆక్రమించేదిగా మార్చారు. వ్యవసాయాన్ని సమష్టీకరించారు. నిరక్షరాస్యతను నిర్మూలించారు. ప్రజల జీవనప్రమాణం త్వరత్వరగా వృద్ధిచెందింది. బలీయమైన రక్షణ బలాలను నిర్మించుకొన్నారు. ఇవన్నీకూడా అత్యంత త్వరితంగా సాధించబడ్డాయి. ప్రపంచంలో యే యితర దేశమూ యింత త్వరగా అభివృద్ధిని సాధించిన ఉదంతం చరిత్రలోనే లేదు. ప్రభుత్వం అనుసరించిన విధానాలను ప్రజాబాహుళ్యం బలపర్చారు; ప్రతి రంగంలోను పరిస్థితులు ఎంతగానో అభివృద్ధి చెందాయి.

సోవియట్ సమాజం సృష్టించిన నూతన మానవుని గుణగణాలు, నైతికస్థాయి అతిభయంకరమైన రెండవ ప్రపంచయుద్ధంలో కళ్ళకు కట్టినట్లు నిరూపితమయ్యాయి.

అంత స్వల్పకాలంలో అంతటి మహోన్నత విజయాలను సాధించిన ప్రభుత్వం మరొకటేదీ లేదు.

ప్రధానంగా సవ్యమైన విధానాలను అమలుజరపటంద్వారా ఘనవిజయాలను సాధించబట్టే, పొరపాటు ఆచరణను, పొరపాటు పద్ధతులను సకాలంలో పసికట్టి, వాటిని అడ్డగించి, సరిదిద్దటం కష్టమైంది.

ఉదాహరణకు 1937, 1938 సంవత్సరాలలో క్రూరకృత్యాలు అనేకం జరిగాయని ఆ రోజుల్లో అనేకమంది అభిప్రాయపడియుండవచ్చు. అయితే అటుతర్వాత యూరప్ దేశాలన్నింటిలోను విస్తృత ప్రాతిపదికపై అంతకుముందే నిర్మించబడిన ఫాసిస్టు పంచమాంగదళాలు హిట్లరు విజయాలకు చాలావరకు దోహదమిచ్చాయని తేలిపోయింది. సోవియట్ యూనియన్‌లో మాత్రం అలాంటి పంచమాంగదళం అంత పెద్దఎత్తున నిర్మించబడలేదని కూడా స్పష్టమైంది. 1937, 1938 సంవత్సరాలలో అమలుజరపబడిన చర్యలే అందుకు కారణమైవుండవచ్చునని భావించటం సహజమేకదా.

భారత కమ్యూనిస్టుపార్టీ అనుభవంకూడా ఇదే తెల్పు తోంది. మేము అనుసరించిన విధానాల, అమలుజరిపిన పద్ధతుల వల్ల ఎప్పుడైతే దుష్ఫలితాలు, ఎదురుదెబ్బలు సంభవించాయో అప్పుడుమాత్రమే ఆ విధానాలలోను, పద్ధతులలోను ఎక్కడో ఏదో పొరపాటు వుందని గుర్తించటం జరుగుతూవచ్చింది. ఎప్పుడైతే గొప్పగొప్ప విజయాలు సాధిస్తున్నామో, అన్నీ సజావు గానే సాగిపోతున్నట్లు పైకి కన్పించాయో అప్పుడల్లా పొరపాట్లను గుర్తించ నిరాకరిస్తూవచ్చాం; పద్ధతులను, చివరకు కొన్ని సిద్ధాం తాలను లోతుగా పరిశీలించి, పొరపాట్లను చక్కదిద్దుకోటానికి వ్యతిరేకతను వ్యక్తంచేస్తూవచ్చాం.

అంతకన్నా మరొక ముఖ్యకారణంకూడా వుంది. పాత సమాజంలోనుంచి జన్మించే కొత్తసమాజం పుట్టుకతోనే పాత సమాజపు లక్షణాలను కొన్నింటిని కలిగియుండక తప్పదు. కొత్తగా ఉద్భవించే ఏ సమాజానికైనా అది వర్తిస్తుంది. ఒక సమాజం రూపుమాసిపోయి, కొత్తసమాజం అవతరించిన తర్వాతకూడా చాలకాలందాకా పాత అలవాట్లు, ఆచరణ పద్ధతులు, దృక్ప థాలు వెంటాడుతూనేవస్తాయి. చరిత్రను రూపొందించేది జనసామాన్యం కాదని, మహాపురుషులు మాత్రమేనని భావించే దృక్పథం చాలా పురాతనమైనది. అధికార వ్యామోహం, అధికార దుర్వినియోగం, అహంకారం, అహం భావం, విమర్శపట్ల అసహనం ఈ అవలక్షణాలన్నీ వర్గరహిత సమాజంలోపుట్టి, ప్రబలతరమై, చివరకు సోషలిస్టు సమాజంలో కూడా కొనసాగుతాయి. దీర్ఘకాల పోరాటంద్వారా వాటిని నిర్మూలించవలసి వుంటుంది. విప్లవానంతరం లెనిన్ చేసిన హెచ్చరి కలను ఈ సందర్భంలో గుర్తుంచుకోవాలి. నిరంకుశత్వం ప్రబలు తుందనీ, దానికి వ్యతిరేకంగా పోరాటం సాగించాల్సిన అవసరం ఎంతోవుందనీ ఆయన పదేపదే హెచ్చరిస్తూ అనేకవ్యాసాలు వ్రాసారు. సోషలిస్టు సమాజంలో రాజ్యాంగ యంత్రానికి అపార

మైన, యిశోధికమైన అధికారాలు సంక్రమిస్తాయి. అందుచేత నిరంకుశత్వం పెచ్చుపెరిగే ప్రమాదం హెచ్చుగా వుంటుంది. వర్గాలు నశించిపోయినంతమాత్రాన ఆ ప్రమాదం పోదు.

పెట్టుబడిదారీ పాలనవల్ల దాపురించిన అత్యంత హేయమైన ఫలితాలలో ఒకటి నిరంకుశత్వం; తనపైవారికి సలాములుకొట్టుతూ దాసులుగా ప్రవర్తించటం, తన క్రిందివారిని పురుగులను చూసినట్లు చూడటం ఆ నిరంకుశత్వంలోని ముఖ్యలక్షణం. అలాంటి దానికి వ్యతిరేకంగా సోషలిస్టు ప్రజాతంత్రం గట్టి పోరాటం సాగించవలసివుంటుంది. దీనిని గురించి మాటలలో అనేకసార్లు నొక్కి చెప్పినప్పటికీ, ఆచరణలో మాత్రం దానిని అమలుజరిపినట్లు కన్పించదు.

తక్కువ వేతనాలు పుచ్చుకొనే ఉద్యోగులకు, ఎక్కువ వేతనాలు పుచ్చుకొనే ఉద్యోగులకు మధ్య వ్యత్యాసం గణనీయం గానేవుంది. (అయితే ఆ వ్యత్యాసం పెట్టుబడిదారీ దేశాలలో కన్నా సోవియట్‌లో తక్కువగావుందనుకోండి. అదీకాక, సోషలిస్టు సమాజంలోకూడా కొంతకాలందాకా ఆ వ్యత్యాసం తప్పనిసరిఅవుతుంది.) నిరంకుశత్వధోరణులు ప్రబలటానికి వేతనాలలో గల యీ వ్యత్యాసంకూడా కొంతవరకు దోహదమిచ్చివుంటుంది. అదెంతవరకు కారణభూతమైందో, దానిని నివారించటానికి ఏ యే చర్యలు తీసుకోవాలో సోవియట్ నాయకులు నిశ్చయించాలి. ఆదాయాలలోగల వ్యత్యాసాన్ని తగ్గించటంకోసం పార్టీ 20 వ మహాసభ తర్వాత అనేక ముఖ్యచర్యలను అమలుజరుపుతున్నారు.

అందుచేత, సోవియట్ చరిత్రలో కొంతకాలంపాటు అనేక కారణాలవల్ల నిర్బంధ విధానం దాపురించింది; అవి చాలా క్లిష్టస్వభావం కలిగియున్నాయి. ముఖ్యంగా ఫలానా కారణంవల్ల అలా జరిగింది అని ఇదమిత్థంగా తేల్చి చెప్పటం చాలా కష్టం. సోవియట్ ప్రాంతంపై దురాక్రమణ జరిగే ప్రమాదం వాస్తవంగా వుంది. గతంలో రెండుసార్లు పెద్దపెద్ద సోవియట్ భూభాగాలను

దురాక్రమణ శక్తులు కబళించివున్నాయి. బయటనుంచి వస్తున్న ఈ ప్రమాదం దృష్ట్యా దేశం లోపల శత్రువులకు వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటం సాగించవలసి వచ్చింది. అధికారాన్ని కేంద్రీకరించి, ఉక్కు-శిక్షణను అమలు జరపవలసిన అవసరం మెండైంది. వ్యక్తిపూజ ప్రబలింది. స్టాలిన్ చేసిన ప్రతి సూత్రీకరణను గుడ్డిగా, వేద వాక్కు-గా పరిగణించసాగారు. సోషలిజం విజయవంతమైన తర్వాత వర్గపోరాటం తీవ్రతరమవుతుందన్న సిద్ధాంతం చెలామణిలోకి వచ్చింది. దానితో లేనిపోని అనుమానాలు, కుశ్శంకలు రాజ్యమేలే వాతావరణ మేర్పడింది; భద్రతాశాఖల స్థానం బలవత్తరమైంది. అనేకమందిని విచక్షణా రహితమైనపద్ధతిలో "శత్రువులు"గా ముద్రవేశారు. ప్రధానంగా సవ్యమైన విధానాలు అమలు జరపటంద్వారా సాధించబడిన అఖండ విజయాలవల్ల అనేకమంది నాయకులు, కార్యకర్తలుకూడా అమలు జరుపుతున్న తప్పు కార్యాచరణ పద్ధతులను సకాలంలో పసికట్టలేకపోయారు; పైగా, జరిగిన తప్పు పనులలో అధికభాగం చాలాకాలం గడిచిన తర్వాతనే వెలుగులోకి వచ్చాయి. ప్రజాబాహుళ్యం ఉత్సాహంతో ప్రభుత్వ విధానాలను బలపర్చారు. సోషలిస్టు నిర్మాణంలో వారు ఇనుమడించిన ఉత్సాహంతో పాల్గొన్నారు. అదిచూసి, చెప్పుకోతగిన లోపాలేవీ లేనట్టే అంతా భావించసాగారు. రాజ్యాంగయంత్రం విధులు విపరీతంగా విస్తరించటంతో, నిరంకుశత్వం ప్రబలే ప్రమాదంకూడా తోడునీడవలె వెన్నాడింది. గత కాలపు సమాజాలవల్ల సంప్రాప్తించిన అలవాట్లను, దృక్పథాలను, వ్యసనాలను నిర్మూలించటం అంత తేలికయిన విషయంకాదు; అందుకు దీర్ఘ కాల పోరాటం సాగించవలసివుంటుంది. సోవియట్ సమాజంలో కొన్ని క్షీణ లక్షణాలు అసలు ఎందుకు తలెత్తినవో, రాను రాను అవి యెలా తీవ్రరూపంలో ప్రకోపించి, తీవ్రస్వభావం కల్గిన లోపాలుగా పరిణమించాయో

తెలుసుకోవాలంటే, పైన పేర్కొన్న విషయాలను, వాటితోపాటు యింకా అనేక అంశాలను పరిగణనలోకి తీసుకోవలసివుంటుంది.

అంటే జరిగిన క్రూరకృత్యాలన్నీ అనివార్యమైనవనా దీని అర్థం? ఎంతమాత్రంకాదు. అసలు కొన్ని విషయాలు ఎలా సంభవించాయో అర్థంచేసుకోటం ఒకటి; అవి అనివార్యమైనవని చెప్పటం యింకొకటి. అనివార్యమైనవని చెప్పటమంటే, జరిగిన విషయాలన్నింటినీ సమర్థించటంతప్ప మరొకటికాదు.

విచక్షణారహితంగా అరెస్టులుసాగించటం, ఏ నేరమూ చేయని నిజాయితీపరులైన కమ్యూనిస్టులను, పౌరులను నిర్బంధ విధానానికి గురిచేయటం, సోవియట్ న్యాయచట్టాలను, సోషలిస్టు నీతిసూత్రాలను అతిక్రమించటం – వీటిని ఏవిధంగానూ సమర్థించటానికి వీలులేదు. వాటిని తీవ్రంగా ఖండించాలి. ఆ పనులు చేయవలసిన అవసరం ఈషణ్మాత్రంలేదు. వ్యక్తిపూజ పెరుగుదలను అరికట్టినపక్షంలో, పార్టీ తగినంత జాగ్రత్తతో ప్రవర్తించియున్న పక్షంలో, శ్రామిక ప్రజాతంత్రం విషయంలోజరిగిన అక్రమాలను గట్టిగా ఎదుర్కొనియున్న పక్షంలో-అనేక క్రూరకృత్యాలను నివారించ వీలయ్యేది.

## నిరంకుశాధికారవర్గం అంటూ ఒకటి తయారైందా?

అయితే, సోవియట్ సమాజంలో కుళ్ళు ప్రవేశించిందనటానికిగానీ, అసలు సోషలిస్టు స్వభావమే ఆ సమాజంలో నశించిపోయిందనటానికిగాని ఎలాంటి ఆస్కారం కన్పించదు. ఉత్పత్తి సాధనాలు తిరుగులేని విధంగా సమాజం చేతులలోనే వున్నాయి. ఒకవర్గాన్ని మరొకవర్గం దోపిడీచేసే పద్ధతి పూర్తిగా అదృశ్యమైంది. ప్రజల శ్రమఫలితాన్ని ప్రజలే అనుభవిస్తున్నారు. అంతేగాని 'అదృష్టవంతు'లైన కొద్దిమంది భూస్వాములో, పెట్టుబడిదారులో ప్రజల శ్రమఫలితాన్ని అనుభవించటంలేదు.

ఉత్పత్తిసాధనాలు ప్రజలపరమైయుండటం ఒక్కటే సోవియట్ ప్రజాస్వామ్యంయొక్క ప్రధాన లక్షణంకాదు; అమలులో వున్న పరిపాలనా తీరుకూడా దాని విశిష్ట లక్షణాన్ని నిరూపిస్తుంది. ప్రజలచేత ఎన్నుకోబడే సోవియట్లే రాజ్యాంగాధికార నిర్వహణ సాధనాలు అన్న విషయం గుర్తుంచుకోవాలి.

స్థానిక సోవియట్లయొక్క విశిష్ట లక్షణాలేమిటో చూడండి; పెట్టుబడిదారీ దేశాలలోని స్థానిక సంస్థలకూ వీటికీ ఎంత వ్యత్యాసం వుందో గమనించండి.

"ప్రతి గ్రామం, శివారు, ప్రతి పట్టణం, ప్రతి జిల్లా, ప్రతి ప్రాంతం, మండలం, ప్రదేశం తన సోవియట్‌ను కలిగియుంది.

"పూర్వం జారిస్టు రష్యాలోను, ఇప్పటికే పెట్టుబడిదారీ దేశాలలోను అమలునందున్న నామమాత్రావశిష్టమైన స్థానిక ప్రభుత్వ సంస్థలకు, స్థానిక సోవియట్లు పూర్తిగా భిన్నమైనవి; ఆ స్థానిక ప్రభుత్వ సంస్థలకు అసలు ఎలాంటి రాజ్యాంగాధికారం లేదు. పూర్వం జారిస్టు రష్యాలోను, ఇప్పటికే పెట్టుబడిదారీ దేశాలలోను ప్రభుత్వంచే నియమించబడిన అధికారులే స్థానికంగా అధికారం చలాయిస్తారు.

"ప్రాదేశిక సోవియట్ మొదలుకొని గ్రామ సోవియట్ వరకు శ్రామిక ప్రజాప్రతినిధులతో ఏర్పడిన స్థానిక సోవియట్లు, స్టాలిన్ రాజ్యాంగంప్రకారం స్థానిక రాజ్యాంగాధికార సంస్థలుగా వ్యవహరిస్తున్నాయి.

"తమ తమ నియోజకవర్గాలలోని ఆర్థిక, సాంస్కృతిక, రాజకీయాభివృద్ధి మంచి చెడులను స్థానిక సోవియట్లు చూస్తుంటాయి; తమ తమ బడ్జెట్టులను తయారు చేసుకుంటాయి; తమ తమ ప్రాంతాలలో శాంతిభద్రతలను కాపాడుతుంటాయి; చట్టాలు అమలు జరిగేటట్లూ, పౌరులహక్కులను కాపాడేటట్లూ చూస్తుంటాయి. దేశరక్షణ స్థోమతను పెంపొందించటానికి సహాయ పడు

తుంటాయి. తమ కార్యనిర్వాహక వర్గాలను స్థానిక సోవియట్లు ఎన్నుకొంటాయి. ఆ కార్యనిర్వాహకవర్గాలు స్థానిక సోవియట్లకు సంజాయిషీ చెప్పుకొంటుండాలి. ప్రజావిద్య, ప్రజారోగ్యం, స్థానిక పరిశ్రమలు, వాణిజ్యం, సామాజిక సౌకర్యాలు మున్నగు పరిపాలనా శాఖలను, వ్యవహారాలను చూసేందుకు అవి ప్రత్యేక శాఖలను నెలకొల్పుతాయి.

"శ్రామిక ప్రజా ప్రతినిధులతో ఏర్పడిన సోవియట్లు తమ కృషిలో తోడ్పడేందుకు స్థాయిసంఘాలను ఎన్నుకొంటాయి; ఈ సంఘాలు సోవియట్లకు, ప్రజానామాన్యానికి సాన్నిహిత్యం చేకూర్చు తాయి; పరిపాలనా నిర్వహణలో ప్రజాసహకారాన్ని సాధించి పెట్టుతాయి. (వి. కార్పిన్‌స్కీ రచించిన "సోవియట్‌లో సామాజిక రాజ్యాంగ యంత్రం." 43, 44 పేజీలు)

దీనినంతటినీ కేవలం ప్రచారంక్రింద కొట్టిపారేసే వారంతా ఫేబియన్ సోషలిజానికి స్రష్టలైన వెబ్ దంపతులు తమ గ్రంథంలో ఏమి వ్రాశారో ఒకసారి చూడండి. వారు స్వయంగా సోవియట్ యూనియన్‌లోని ప్రతిఅంశాన్ని లోతుగా పరిశీలించి వచ్చాకనే వ్రాసిన "సోవియట్ కమ్యూనిజం—నూతన నాగరికత" అన్న సుప్రసిద్ధ గ్రంథంలో గ్రామ సోవియట్‌ను గురించి యిలా తెలిపారు:

"అన్ని చట్టాలు, నిబంధనలు తు. చ. తప్పకుండా అమలు జరుగుతున్నదీ లేనిదీ అజమాయిషీ చేసే అధికారం, తనిఖీచేసే అధికారం, ఆదేశించే అధికారం, ఆడిట్‌చేసే అధికారం గ్రామ సోవియట్ కల్గియుంది. పైగా తన ఆధీనప్రాంతంలో గల ప్రభుత్వ ఉత్పత్తికి, వాణిజ్యశాఖల వ్యవహారాలను సదా ఒకకంటకనిపెడుతూ వుండటం కూడా గ్రామ సోవియట్ బాధ్యతలలో ఒకటి...... పోతే గ్రామంలో రోడ్లనిర్మాణం, నీటి సరఫరా, వినోదకేంద్రాలు, పాఠశాలలు, నాటకశాలలు, ఆసుపత్రులు మున్నగువాటి నిర్వహణ—ఇంతెందుకు సకలవిషయాలను అజమాయిషీ చేసే అధికారం గ్రామసోవియట్‌కే చెందివుంటుంది.

"మన పంచాయితీలకు, జిల్లాబోర్డులకు గల పరిమితాధికారాలతో మాత్రమే పరిచయమున్న బ్రిటిషు పాఠకునికి రష్యన్ స్టెప్పీ లేక సైబీరియా అడవులలో గల గ్రామాలలో స్థానిక సంస్థలకు గల వివిధ అధికారాల దీర్ఘ పట్టికను యిక్కడ ఉదహరిస్తే, అదంతా వట్టి బూటకంలాగు కన్పించవచ్చు. సోవియట్ న్యాయ శాస్త్రవేత్తలు సెలో సోవియట్‌కు సర్వం సహాధికారం కలదని అంటే, అది పైనుంచి అనుమతి పొందకుండానే తనకు అవసరమైన ఏ పనినైనా చేసే అధికారం కలిగియుందని చెప్పినప్పుడు బ్రిటిషు పాఠకుడు మరింత ఆశ్చర్య పడటం సహజం."

(సంపుటి ఒకటి: 29 - 30 పేజీలు)

"రైతును చూసి సోవియట్ ప్రభుత్వం భయపడటం లేదనీ, నిజమైన ప్రజాస్వామ్యంపట్ల ఆ ప్రభుత్వానికి అనుమానాలు లేవనీ దీనినిబట్టి స్పష్టం కావటంలేదా" అనికూడ వెబ్ దంపతులు వ్యాఖ్యానించారు. (అదే సంపుటి: 30 వ పేజీ)

గ్రామ సోవియట్ చేసే ఒక నిర్ణయాన్ని వీటోచేసే అధికారం ఏ నిరంకుశాధికారికీ లేదనీ, ఉన్నత సోవియట్‌గాని, దానిచే ఎన్నుకోబడిన కార్యనిర్వాహకవర్గంగానీ మాత్రమే దానిని వీటోచేసే అధికారం కలిగియుంటుందనీ ఆ రచయితలు పేర్కొన్నారు. ఇంకా ఇలా వ్రాశారు:

"కేవలం స్థానికమైన, ఒక గ్రామానికి సంబంధించిన సమస్యలను మాత్రమే గ్రామ సోవియట్ పరిశీలించితే సరిపోదని సోవియట్ ప్రభుత్వం అభిప్రాయం; రేయన్ (అంటే అనేక గ్రామాలు, చిన్న పట్టణాలు కలిసి ఏర్పాటైనది) వ్యవహారాలను, ఒబ్లాస్ట్ (రాష్ట్రం వంటిది) వ్యవహారాలను, చివరకు దేశవ్యాప్త ప్రాధాన్యం కలిగిన సమస్యలనుకూడా ప్రతి గ్రామ సోవియట్ చర్చించాలని ఇటీవలనే జారీచేయబడిన డిక్రీ నిర్దేశిస్తోంది."

(అదే సంపుటి: 28, 29 పేజీలు)

ప్రజలలో అపారమైన సృజనాత్మకశక్తిని జనింపచేసినది ఈ వ్యవస్థే. ఈ వ్యవస్థ కారణంగానే పరిపాలనా నిర్వహణలోను, సోషలిస్టు నిర్మాణంలోను కోటానుకోట్ల ప్రజలు సచేతనులై పాల్గొంటున్నారు. ఈ వ్యవస్థవల్లనే కనీ వినీ యెరుగని యమ యాతనలనైనా, కష్టాలనైనా సోవియట్ ప్రజాసామాన్యం సంకల్పబలిమితో, త్యాగనిరతితో, వీరోచితంగా అధిగమించగలుగు తున్నారు.

సోవియట్ ప్రజాస్వామ్యంలోని అత్యంత ప్రధాన లక్షణాలు నేటికీ చెక్కు-చెదరకుండానే వున్నాయి. అందుచేతనే సోవియట్ సమాజం నిరంతరాభివృద్ధిని పొందుతూ, బలవత్తరమవుతూ సుస్థిరమైంది. ప్రతిరంగంలోనూ అఖండ విజయాలు సాధించగల్గింది. తద్వారా సోషలిజంయొక్క శక్తిసామర్థ్యాలు ఎలాంటివో, అధికారం శ్రామిక ప్రజల హస్తగతమైననాడు ఎంతటి ఘనవిజయాలు సాధించవచ్చో సోవియట్ సమాజం ఆచరణలో నిరూపించింది. పైనుంచి మొట్టికాయలు వేయటంద్వారాను, బలప్రయోగం ద్వారాను ఈ విజయా లన్నింటినీ సాధించారని వాదించేవారు, అసలు తాము ఏమి మాట్లాడుతున్నారోకూడా వారికే తెలియదు. చరిత్రనేర్పే గుణపాఠాలను వారు గుర్తించటంలేదు. భయోత్పాతం కలిగించే నియంతృత్వం ప్రజలను తొక్కి-పట్టి వుంచగలదుగాని, ప్రజల సహకారాన్ని ఏమాత్రం పొందజాలదు; ప్రజలను ఉత్తేజ పర్చజాలదు. సోవియట్ యూనియన్‌లో సాధించవలసిన పరివర్తన వంటి దానిని తీసుకురావటానికి అవసరమైన వీరోచిత గుణగణాలను అది సృష్టించలేదు.

అయితే దీనితోపాటు మరొకటికూడ సంభవించింది. ముఖ్యంగా పైస్థాయిలలో, క్రమంగా నిరంకుశ నాయకత్వపద్ధతు లను బలవంతాన రుద్దటం, నిరంకుశంగా ప్రవర్తించటం, ప్రజా స్వామ్య విరుద్ధమైన పద్ధతులను అవలంబించటం జరిగింది. తత్ఫలి తంగా ప్రజలలో చొరవ నశించిపోయింది. నిర్భాగమాటమైన

పద్ధతిలో విమర్శ, ఆత్మవిమర్శలను ఆ పద్ధతులు నిరుత్సాహ పర్చాయి. హానికరమైన యీ ధోరణులు పైస్థాయిలలో తలెత్తటంతో క్రిందిస్థాయిలలో కొంతవరకు దుష్ఫలితాలు తెచ్చిపెట్టాయి.

సోవియట్ ప్రజాస్వామ్యానికి విఘాతం కల్గటంమాత్రమే కాక, అసలు ఆ సమాజం ప్రజాస్వామిక స్వభావాన్నే పూర్తిగా కోల్పోయినదని వక్కాణించేవారుకూడా కొందరు లేకపోలేదు. సోవియట్లు కేవలం నామమాత్రావశిష్టమైన రాజ్యాంగాధికార సంస్థలుగానే మిగిలిపోయాయనీ, కమ్యూనిస్టుపార్టీ, స్టాలిన్‌లు ప్రాతినిధ్యంవహించిన నిరంకుశాధికారవర్గం ఒకటి తయారైందనీ, ఆ వర్గమే వాస్తవంగా పరిపాలిస్తుందనీ వారంటారు. సిద్ధాంతరీత్యా చూస్తే అట్టిది అసంభవమైన విషయం కాకపోవచ్చు. కాని, వాస్తవంగా అలా జరిగిందా అన్న అంశాన్ని మన మిప్పుడు పరిశీలించాలి.

నిజంగానే అలాంటి నిరంకుశాధికారవర్గం తలెత్తియుంటే, ఆ వర్గం ఏవిధంగా అధికారాన్ని నిర్వహిస్తుంది? అన్న ప్రశ్న వెంటనే ఉత్పన్నమవుతుంది. విద్య, ఉద్యోగాలు మున్నగువాటి విషయంలో ఆ వర్గానికి చెందిన వ్యక్తుల బిడ్డలకు, ప్రత్యేక సదుపాయాలేమైనా ఏర్పాటయ్యాయా? ఆ వర్గంయొక్క అధికారానికి ఆర్థిక పునాదిగా ఆస్తి సంబంధాలలో ఏమైనా మార్పులు వచ్చాయా? "పాలకవర్గానికి" చెందిన వ్యక్తులు సొంత పొలాలు, ఫ్యాక్టరీలు సంపాదించుకొన్నారా? పెట్టుబడిదారులు, భూస్వాములు తిరిగి ప్రత్యక్షమై, ప్రజల శ్రమఫలితాన్ని దోచుకు తింటున్నారా? నిజంగా అలాజరగటం అంటే విప్లవ విఘాతం (కౌంటర్ రివల్యూషన్) తప్ప మరొకటి కాదు. సోవియట్ యూనియన్‌లో నేడు దోపిడీవర్గాలన్నవి మచ్చుకైనా కానరావటంలేదు. శ్రమజీవులే ఆ దేశానికి అధినేతలుగా వున్నారు.

వారొక దృష్టితో చూచినప్పటికీ, సోవియట్ యూనియన్‌లో పరిమితమైన నిరంకుశాధికారవర్గం చేతిలో అధికారం

కేంద్రీకృతమైపోయిందనే సిద్ధాంతానికి ఏమాత్రం ఆధారం వున్నట్టు కనపడదు. విదేశీ, దేశీయ వ్యవహారాలలో అపూర్వమైన విజయాలను సాధించిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులే గతంలో ప్రజాస్వామ్యానికి జరిగిన విఘాతాలను గురించి 20 వ మహాసభలో బాహాటంగా ఎందుకు వెలుగులోకి తీసుకొచ్చారు? పై సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నవారు ఈ ప్రశ్నకు సరియైన సమాధానం చెప్పలేకపోతున్నారు. సోవియట్‌లో భద్రతాశాఖల అధికారాలను ఇప్పుడు ఎందుచేత బాగా తగ్గించివేశారో వారు వివరించలేకపోతున్నారు. గత కొలది సంవత్సరాలలోను సోవియట్‌లో ప్రజాస్వామ్యం బాగా విస్తరించినదని చివరకు సోవియట్‌ను విమర్శించేవారు సైతం అంగీకరిస్తున్నారు. ♦

పాలకవర్గానికి చెందినవారు ఉన్మత్తులైపోతేతప్ప అలాంటి పనులు చేయరు. అదీగాక, తమకు అపకీర్తి తెచ్చిపెట్టే వాస్తవాన్ని ఎలా మభ్యపరుద్దామా అని పాలకవర్గం ఎప్పుడూ చూస్తుంటుంది. అధికార అందలం ఎక్కటానికి నిచ్చెనలాగా ఉపయోగపడే వ్యక్తిపూజను వారు కొనియాడతారేగాని తెగడబోరు. నిరంకుశత్వ యంత్రాన్ని వారు మరింత పటుతరమొనర్చుతారేగాని సడలించబోరు. తాము అనుసరించిన విధానాలద్వారా సాధించిన విజయాలను తాము చేసిన తప్పిదాలను కప్పిపుచ్చుకో

---

♦ బొంబాయినుంచి వెలువడుతున్న 'బ్లిట్జ్' వారపత్రిక విలేఖరితో ముచ్చటిస్తూ ఉపరాష్ట్రపతి డాక్టర్ రాధాకృష్ణ ఇలా పేర్కొన్నారు: "సోవియట్ యూనియన్‌లోను, తదితర సోషలిస్టు దేశాలలోను జరుగుతున్న పరిణామాలు చాలా ప్రముఖమైనవి. ఆ పరిణామాలు ఆ దేశాలలో ప్రజాస్వామ్యం విస్తరించటానికి, ప్రపంచ వుద్రిక్తతను తగ్గించటానికి చాలా బాగా ఉపకరిస్తాయి." ఉపరాష్ట్రపతి యింకా యిలా అన్నారు: "సోవియట్ యూనియన్ దుర్బలత్వం కారణంగా అమోఘమైన ఈ పరిణామాలు సంభవించటంలేదు. ఈ విషయంలో పొరబడకండి. వారు చాలా బలవంతులు; వారికి లేనిది అంటూలేదు. అనన్యమైన ఆత్మవిశ్వాసం వారికి వుంది. వారి శాంతి వైఖరి నిజాయతీతో కూడుకొన్నది."

జూస్తారు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఇప్పుడు సోవియట్ నాయకులు వ్యవహరించినట్లు వారు వ్యవహరించరు; తమ వైదేశిక దేశీయ విధానాలు పూర్తిగా విఫలమైపోయి, తీవ్రమైన సంక్షోభ పరిస్థితులు ఏర్పడి, ప్రజలు తిరగబడే ప్రమాద పరిస్థితులలో మాత్రమే సామాన్యంగా నిరంకుశాధికార వర్గం తమ తప్పులను ఒప్పుకొంటుందేమో!

పార్టీలోనూ, ప్రభుత్వ యంత్రంలోనూ నిరంకుశత్వ ధోరణులు కొంతవరకు ప్రబలినమాట నిజమే. అయితే సోవియట్ యూనియన్‌లో నిరంకుశాధికారవర్గం అంటూ ఒకటి తలెత్తిందనే సిద్ధాంతంమాత్రం పూర్తిగా నిరాధారమైనదనీ, నిర్హేతుకమైనదనీ చెప్పకతప్పదు.

రెండు ప్రపంచాలు - సాపేక్షక పరిశీలన

ఏ ప్రభుత్వమూ గుండెమీద చేయివేసుకొని, సగర్వంగా చెప్పుకోలేనంతటి ఘన విజయాలను సోవియట్ ప్రభుత్వం సాధించింది. సోవియట్ నాయకులు సాహసోపేతంగా తమ దేశంలో జరిగిన పొరపాట్లను బయటపెట్టారు; వాటిని సరిదిద్దటానికి గట్టి చర్యలు అమలుజరిపారు. ఈ పొరపాట్లు ఎలా జరిగాయో, ఎందుకు జరిగాయో వివరిస్తూ సోవియట్ నాయకులు పేర్కొన్న విశదీకరణ అందరికీ సంతృప్తికరంగా వుండకపోవచ్చు. అంతకన్నా లోతుగా సమస్యలను తరచవలసి వుంటుందని ఎవరైనా భావించవచ్చు. అలాంటివి తిరిగి జరగకుండా నివారించేందుకు యింకా ఎక్కువ గ్యారంటీలు అవసరమని అనవచ్చు. కాని, వారి ఒప్పుదల ప్రాధాన్యాన్నిగానీ, అటుతర్వాత వారు అమలు జరిపిన చర్యలనుగానీ ఎవరూ తక్కువచేసి చూపరాదు. అందుచేతనే దేశదేశాలలోని సోషలిస్టు, ప్రజాతంత్ర భావాలుగల వారంతా వారి ఒప్పుదలలను, వారు గైకొన్న చర్యలను హర్షించారు.

లోగడ జరిగిన అక్రమమైన నిరంకుశ చర్యలను, క్రూర కృత్యాలను బయటపెట్టి, వాటిని సరిదిద్దటం కోసం గట్టిచర్యలను

అమలు జరుపుతున్నది కేవలం ఒక్క సోవియట్ యూనియన్‌లోనే కాదు. 20 వ మహాసభ ప్రాముఖ్యం, ఆ మహాసభ నిర్ణయాల ప్రాధాన్యం ఇతర సోషలిస్టు దేశాలకు కూడా వ్యాపించింది. 20 వ మహాసభతో ప్రారంభమైన పరిమాణాలు ఎడ తెరిపి లేకుండా అను దినం మనకు కనిపిస్తూనే వున్నాయి. వ్యక్తిపూజా కారణంగానూ, దాని దుష్ఫలితాల వల్లనూ ఏర్పడిన నిర్బంధ వాతావరణం – లేని పోని అనుమానాలు, అపోహలు, నిరంకుశత్వంతో కూడిన నిర్లక్ష్యం, పిడివాదం, సంకుచిత ఆలోచనా ధోరణి ప్రబలిన వాతావరణం పోయి నూతన వాతావరణం నెలకొంటోంది. సోషలిస్టు దేశా లన్నింటిలోను ఆత్మపరిశీలనా కార్యక్రమం కొనసాగుతోంది; సోషలిస్టు సూత్రాలను, సోషలిస్టు నైతిక విలువలను ప్రామాణి కంగా చేసుకొని, గతాన్ని సింహావలోకనం చేసుకొంటున్నారు. జరిగిన పొరపాట్లను గురించి పునర్విచారిస్తున్నారు.

ఈ కార్యక్రమంయొక్క సమగ్రస్వరూపాన్నీ, స్వభావాన్నీ యిటీవల పోలెండ్‌లో జరిగిన పరిణామాలు నిరూపిస్తున్నాయి. పోలెండ్‌లో యిటీవల జరిగిన పరిణామాలనుగురించి వ్యాఖ్యానిస్తూ వార్సా రేడియో యిలా వివరిస్తోంది :

“అక్టోబరులో వచ్చిన వసంతకాలం అది. నిజమైన శ్రామిక వర్గ అంతర్జాతీయతయొక్క వసంతం అది. సోషలిజానికి దారితీసే సొంత పోలిష్ మార్గం రూపొందించటంకోసం సంకల్పసిద్ధిని కలిగింప జేసే వసంతం అది. కమ్యూనిజంయొక్క పునర్వికాసానికి దోహద మిచ్చే వసంతం అది. మొత్తం దేశమంతటా యీ వసంతం తొణికిస లాడుతోంది. ♦

♦ ఈ అవకాశాన్ని చూచుకొని సోషలిస్టు దేశాలమధ్య స్నేహ, సహకార సంబంధాలను దెబ్బతీయాలని ఆశపడిన అమెరికన్ సామ్రాజ్యవాదులకు పోలిష్ ప్రభుత్వం అదే సమయంలో చక్కగా సమాధానం చెప్పింది. సమానత్వ సూత్రం ప్రాతిపదికపై సోవియట్ యూనియన్, పోలెండ్ దేశాలమధ్య రూపొందిన ఐక్యసంఘటన, స్నేహం పోలెండ్ విధానాలకు మూలకందకంగా వుంటాయని పోలెండ్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక పునరుద్ఘాటించింది.

సోషలిస్టు ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నవిధంగా పెట్టుబడిదారీ దేశాలలోని ఏ ప్రభుత్వమూ వ్యవహరించటంలేదు. పెట్టుబడిదారీ దేశాలలోని ప్రభుత్వాలు సాధించే విజయాలు బహు స్వల్పంగానూ, అవి చేసే పొరపాట్లు అధికంగానూ వుంటాయి. అయినప్పటికీ, అవి తాము సాధించిన స్వల్పవిజయాల చాటున తాము చేసిన అధికమైన పొరపాట్లను కప్పిపుచ్చుకొనేందుకే ప్రయత్నిస్తుంటాయి. పెట్టుబడిదారీ దేశాల నాయకులకు, సోషలిస్టుదేశాల నాయకులకుమధ్యగల యీ వ్యత్యాసం ఏదో కాకతాళీయమైనది కాదు. ఆ రెండు వ్యవస్థలకు మధ్య మూలవ్యత్యాసంనుంచే అది ఉత్పన్నమైంది.

పెట్టుబడిదారీ దేశాలలో కొద్దిమందిచేతుల్లో సంపద కేంద్రీకృతమవుతుంది; ఆ ప్రాతిపదికపైన రూపొందిన పెట్టుబడిదారీ వ్యవస్థలో సహజసిద్ధంగా హింస, అన్యాయాలు గర్భితమై వుంటాయి. పెట్టుబడిదారీ దేశాల నాయకులు తాము చెప్పే మాటలకు, చేసే చేతలకు మధ్య కొట్టొచ్చినట్లు కల్పించే వైరుధ్యం వారికి సదా గుర్తుకు వస్తూనేవుంటుంది. అందుచేత వారు తమ తప్పిదాలను ఎల్లప్పుడూ కప్పిపుచ్చుకోవాలనే చూస్తుంటారు. తాము చెప్పే శ్రీరంగనీతులతో వారి పనులను పోల్చిచూడటం అంటే వారికెంతో భయం.

సోషలిజం విషయం వేరు. ఉత్పత్తి సాధనాలపై ప్రజల యాజమాన్యం అన్నదే సోషలిస్టు వ్యవస్థకు పునాది. అందుచేత అది ధర్మబద్ధమైన మానవతావ్యవస్థ. ఆ వ్యవస్థలో ఒకవేళ హింస, అన్యాయాలు జరగవలసివచ్చినా, అవి ఆ వ్యవస్థలో అంతర్గర్భితమై వున్నవి కాదు. కొన్ని ప్రత్యేక చారిత్రక పరిస్థితుల వల్లనో, సోషలిస్టు ప్రజాస్వామ్య సూత్రాలను విసర్జించి పెడమార్గం పట్టినందువల్లనో, లేదా ఆ రెండూ సమ్మిశ్రమం పొందినందువల్లనో అవి సంభవిస్తాయి.

పెట్టుబడిదారీ దేశాలలోని నాయకులు తాము అమలు జరిపే ప్రజా వ్యతిరేక చర్యలను కప్పిపుచ్చుకోనేందుకు ధర్మ సూత్రాలు వల్లిస్తుంటారు. కాని సోషలిస్టు దేశాల నాయకులు అలాకాదు; తాముచెప్పే సూత్రాలకు వారు తు. చ. తప్పకుండా కట్టుబడియుంటారు. ఆ సూత్రాలను కొలబద్దగాపరిగణించుకొంటూ, తాము చేసే పనుల మంచిచెడులను నిర్ణయించుకొంటారు. సాధారణ ప్రజలకు సౌభాగ్యం, సంతోషం, సౌఖ్యం, స్వాతంత్ర్యం సమకూర్చిపెట్టే సోషలిస్టు వ్యవస్థాపన అన్న మహాదాశయసిద్ధికై వారు పాటుబడుతున్నారు. అందుచేతనే వారు తాము సాధించిన విజయాలతోపాటు, వైఫల్యాలను కూడా ప్రజల ముందుంచుతారు. తాము సాధించినదానిని మాత్రమేకాక, సాధించలేక పోయినదానినికూడా పరిగణనలోకి తీసుకొని తమ కృషిలోని మంచి చెడులను అంచనా వేసుకొంటారు. వారు పొరపాట్లు చేస్తుంటారు; అయితే వాటిని సరిదిద్దుకోటానికి కూడా సదా శక్తివంచన లేకుండా ప్రయత్నిస్తూ వుంటారు.

గతంలో విచారకరమైన ఘటనలు జరగటానికి దారితీసిన ప్రత్యేక పరిస్థితులు నేడు అదృశ్యమయాయి. అంటే దాని అర్థం యీ లోపాలన్నీ గతకాలంలో మాయమాయమవుతాయని కాదు. కేవలం ప్రవర్థమానమవుతున్న నూతనభావాల ప్రభావంమాత్రమే కాక గతానికి చెందిన అరిష్టదాయక భావాల అవశేషాల ప్రభావం కూడా యింకా మానవుల మనస్సులపై, వారు నిర్మించిన సంస్థల పైన ప్రసరిస్తూనే వుంటుంది. సోషలిస్టు దేశాలలో వేరూనిన కొన్ని దృక్పథాలను, ప్రబలిన కొన్ని రూపాలను, అమలుపరుపబడిన కొన్ని పద్ధతులను గురించి పునరాలోచించుకొని సంస్కరించుకోవలసిన అవసరం వుంది. సోషలిస్టు ప్రజాస్వామ్యం మూడు పూలు, ఆరు కాయలుగా వికసించటానికి అది చాలా అవసరం. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం, ముఖ్యంగా శ్రామిక ప్రజలు అధికారంలోవున్న దేశాలలోని

కమ్యూనిస్టు ఉద్యమం నిర్వర్తించవలసిన ప్రప్రధాన కర్తవ్యం యిది.

కొత్తరకం పొరపాట్లు - విభిన్న స్వభావం కలిగిన పొరపాట్లు - ఇకముందు జరగబోవని హామీ యివ్వటం సాధ్యంకాదు. ఎంతో అనుభవశాలురే అయినా, ఎంతో వివేకులే అయినా, మానవులన్న తరువాత పొరపాట్లు చేయకుండా వుండలేరు; పొరపాట్లు చేయరని మనం ఆశించటం అంటే గతానుభవంనుంచి ఏమీ నేర్చుకోలేదన్నమాట. అందుచేత మనం అలా ఆశించరాదు. ఒకప్రక్క శత్రువులు సాగిస్తున్న దుష్ప్రచార దాడినుంచి సోవియట్ యూనియన్‌ను, తదితర సోషలిస్టు దేశాలను సమర్థిస్తానే, మరొక ప్రక్క సోషలిస్టు దేశాలు ఏ విషయాల్లోనైనా తప్పులుచేస్తున్నాయని మనం అభిప్రాయపడినప్పుడు, సౌహార్దపూర్వకంగా వారిని మనం విమర్శిస్తుంటాం.

## కమ్యూనిస్టుపార్టీల మధ్య సంబంధాలు

ప్రస్తుత మేర్పడిన నూతన పరిస్థితులలో వివిధదేశాల కమ్యూనిస్టుపార్టీల మధ్య సంబంధాలను తీర్చిదిద్దే సూత్రాలు మిక్కుటమైన ప్రాధాన్యం కలిగియున్నాయి.

ప్రపంచంలోని పీడిత జనానీకాన్నంతటినీ ఏకత్రాటిపై సమీకరించటంలో కమ్యూనిస్టులు గొప్పపాత్ర నిర్వర్తించారు. ఆ పాత్రను గురించి మనం సగర్వంగా చెప్పుకోవచ్చు.

రెండవ ఇంటర్నేషనల్ నాయకులు సోషలిజం గురించీ, అంతర్జాతీయ సౌభ్రాతృత్వాన్ని గురించీ ఎన్నెన్నో కబుర్లుచెప్పారు. కాని, తీరా సమయంవచ్చేసరికి వారి అసలురంగు బయటపడింది; పరీక్షాసమయం ఆసన్నమైనప్పుడల్లా వారు తమ సూత్రాలకు ఉద్వాసనచెప్పి, వాటికి విరుద్ధంగా ప్రవర్తించారు. సామ్రాజ్యవాద కీచులాటలవల్ల యుద్ధపరిస్థితి ఏర్పడినప్పుడల్లా వారు తమ తమ బూర్జువావర్గాల కొమ్ముకాస్తూ, కార్మికవర్గాన్ని

పరస్పర హత్యాకాండకు పురిగొల్పారు. ఇక వలస దేశాల విషయంలో వారు సామ్రాజ్యవాదుల విధానాలనే బలపరుస్తూ వచ్చారు. వలస దేశాల ప్రజలు హీనజాతులవారు అన్నట్లుగా భావించి వారు వ్యవహరించారు.

కాని, కమ్యూనిస్టుపార్టీల ప్రవర్తన అలాంటిది కాదు. అంతర్జాతీయ సౌభ్రాతృత్వసూత్రాన్ని ఎలుగెత్తిచాటటం మాత్రమే కాక, దానిని సాధించేందుకుకూడా అవి శక్తి వంచన లేకుండా పాటుబడుతూవచ్చాయి. కార్మికవర్గంపట్ల, సోషలిజంపట్ల అవి సదా భక్తిప్రపత్తులు కలిగియుంటూ, జాత్యహంకారం, వలస విధానం, జాతిఆధిక్యత మున్నగుఘోరణులను ఏ రూపంలోవున్నా ప్రతిఘటిస్తూ వచ్చాయి. ఏ యే దేశాల బూర్జువావర్గం యుద్ధాలు తెచ్చిపెట్టాయో ఆ యా దేశాలలోని కమ్యూనిస్టులు పరస్పరం సౌహార్దసంబంధాలు ఏర్పరచుకోటం మాత్రమేకాక, తమ పాలక వర్గాలు సాగిస్తున్న ఘోరాలను బహిర్గతంచేస్తూ, సోదరుల మధ్య సాగుతున్న హత్యాకాండను, సంఘర్షణను ఆపుచేయవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తిచేస్తూ వచ్చారు. సామ్రాజ్యవాద దేశాలలోని కమ్యూనిస్టులు వలస దేశాల ప్రజల తరఫున నిలబడి, వారి జాతీయ స్వాతంత్ర్య హక్కును బలపర్చారు.

ఈ సందర్భంలో ఒక విషయం జ్ఞప్తికి తెచ్చుకోండి. భారత దేశం స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న దశలో, మన స్వాతంత్ర్య హక్కును అచంచలంగా బలపరుస్తూవచ్చిన ఏకైక బ్రిటిషు రాజకీయపార్టీ కమ్యూనిస్టుపార్టీయేనన్న విషయం మరచిపోకండి. జాతీయ స్వాతంత్ర్యంకోసం పోరాడుతున్న భారతదేశ సోషలిస్టులను బ్రిటిషు ప్రభుత్వం, సోషలిస్టులమని చెప్పుకొనే బ్రిటిషు లేబర్ పార్టీ అండదండలతోనే అణచివేసిన ఉదంతాన్ని మరచిపోకండి. అంతర్జాతీయ సోదరత్వం అంటే ఏమిటో, దానిని ఎలా సాధించాలో ప్రపంచానికి నిరూపించినది ఒక్క కమ్యూనిస్టు ఉద్యమం మాత్రమేనన్న విషయం మరవకండి.

ఇలాంటి చరిత్రను సంతరింపచేసుకొన్న ఉద్యమం మరొకటి ఏది?

పోరాటక్రమంలో రక్తంతో తడిసి పటిష్ఠవంతమైన ఈ అంతర్జాతీయ ఐక్యతా బాంధవ్యం శ్రామిక ప్రజలకు కమ్యూనిస్టు ఉద్యమం సమకూర్చిపెట్టిన అమూల్య రత్నాలలో ఒకటి. సోషలిజం, ప్రజాస్వామ్యం, శాంతికొరకు సాగించబడిన పోరాటంలో అదొక వజ్రాయుధంగా ఉపకరించింది; ఇప్పటికీ అది అలాగే ఉపయోగ పడుతోంది.

ప్రపంచంలో కమ్యూనిస్టుపార్టీలన్నీ మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలకు తు. చ. తప్పకుండా కట్టుబడి ప్రవర్తిస్తున్నాయి. ఒకవ్యక్తిని మరొకవ్యక్తి పీడించే సాంఘిక ధర్మాన్ని తుదముట్టించి, వర్గరహిత సమాజం స్థాపించాలన్న సమగ్రలక్ష్యంతో అవి పనిచేస్తున్నాయి. శాంతి రక్షణ, దేశదేశాల ప్రజలమధ్య స్నేహ సంబంధాల స్థాపన, అన్ని దేశాలకు స్వాతంత్ర్యం సాధించి, పటుతర మొనర్చటం, అన్నిరూపాలలోని వలసపీడనను, జాతి వివక్షతను రూపుమాపటంవంటి అనేక ఉమ్మడి కర్తవ్యాల నిర్వహణకు అవి పాటుబడుతున్నాయి.

అందుచేత, అంతర్జాతీయ శ్రామికవర్గ స్నేహబాంధవ్యాన్ని పదిలపర్చుతూ, పటిష్ఠవంత మొనర్చవలసిన అవసరం ఎంతేని కలదు. కమ్యూనిస్టుపార్టీలు తమ సౌహార్ద సంబంధాలను కొనసాగించుకొంటుండాలి; అవి తమ అనుభవాలను పరస్పరం మార్పిడి చేసుకొంటూ, ఒకరినుంచి మరొకరు నేర్చుకొంటుండాలి. పొరపాట్లను, లోపాలను, బలహీనతలను నిర్మూలించే నిమిత్తం పరస్పర సంబంధాల విషయంలో అవి విమర్శ, ఆత్మవిమర్శ హక్కులను వినియోగించుకొంటుండాలి. ప్రతి దేశంలోను, మొత్తం ప్రపంచమంతటా శాంతి, ప్రజాస్వామిక, సోషలిస్టు శక్తులను మరింత సమైక్యపర్చేందుకు వీలుగా అవి వ్యవహరించాలి.

శ్రామిక ప్రజలు అధికారంలోగల దేశాలలో సోషలిస్టు పరివర్తనా కర్తవ్యాన్ని సమర్థవంతంగా నిర్వర్తించాలంటే, సోష లిస్టు దేశాలమధ్య సన్నిహిత సహకారం ఎంతేని అవసరం. ఈ విష యంలో సోవియట్ యూనియన్ పాత్రకు యికముందుకూడా అత్యంత ప్రాధాన్యం వుండకతప్పదు.

అయితే, అదే సమయంలో కొందరి బుర్రలలో గల కొన్ని తప్పుడు దృక్పధాలను నిర్మూలించాలి. ప్రపంచ కమ్యూనిజం శ్రేయస్సుకు, అంతర్జాతీయ సహకార సాధనకు అది చాలా అవసరం.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీ వంటి ముఖ్యమైన పార్టీలు ఎన్నో ఘనవిజయాలు సాధించివున్నాయి. పోరాటంలో మునిగి తేలుతున్న శ్రామిక ప్రజలంతా ఎల్లప్పుడు వాటి అనుభవ సంపదను కాంచి, ఉత్తేజం పొందుతూనే వుంటారు. అన్ని దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలకు వాటి అనుభవం ఎంతో అమూల్యమైనది. ఆ పార్టీలు గడించిన అనుభవంతోపాటు ఇతర పార్టీలు గడించిన అనుభవంకూడావుంది. ప్రజాస్వామ్యం, సోష లిజంకోసం పోరాటం సాగిస్తున్న ఉద్యమం యింకా పురోగమించే కొలదీ, నూతన విజయాలు సాధించేకొలదీ యింకా నూతన అను భవాలు లభిస్తాయి. ఏదో ఒక అనుభవం మాత్రమే అందరికీ నమూనాగా, ధృవతారగా పనికివస్తుందన్నది ఎలాంటి తప్పుడు దృక్పథమో చరిత్ర నిరూపించింది.

సువిశాలమైన ప్రాంతాలలో సోషలిజం విజయవంతమైంది. ఒక్కొక్క ప్రాంతంలో అది ఒక్కొక్క రూపం ధరించింది. ఉద్య మం యింకా ముందుకు సాగే కొలదీ యింకా కొత్తరూపా లెన్నో బయటపడతాయి. సోషలిజం యింకా జయప్రదంకాని అనేక దేశాలలో సైతం సోషలిజం ప్రజాశక్తిగా అభివృద్ధిచెందింది. వివిధదేశాలలోని ఉద్యమాలను విభిన్నమైన క్లిష్ట సమస్యలు ఎదు ర్కొంటున్నాయి.

ప్రతిదేశంలోని కమ్యూనిస్టుపార్టీ ఒకవైపున మార్క్సిస్టు - లెనినిస్టు ఉపదేశాలను కరదీపికగా స్వీకరించి, మరొకవైపున ఆ ఉపదేశాలను తనదేశానికి ఎలా వర్తింపచేయాలో తెలుసుకొన్నప్పుడే, తనదేశప్రజలపట్ల తన విద్యుక్తధర్మాన్ని నిర్వర్తించగలుగుతుంది. మొత్తం కమ్యూనిస్టుఉద్యమంయొక్క సమష్టిఅనుభవ సంపదనుంచి ప్రతికమ్యూనిస్టుపార్టీ గుణపాఠాలు పరిగ్రహించాలి; అదే సమయంలో తన దేశంలోని పరిస్థితులకు, తన దేశప్రజల జాతీయ సంప్రదాయాలకు అనుగుణమైన విధానాలను స్వయంగా రూపొందించుకోవాలి. అన్ని దేశాల కమ్యూనిస్టుపార్టీలనుంచి నేర్చుకొంటూ, ప్రతిదేశంలోని కమ్యూనిస్టుపార్టీ తన అవగాహన ప్రకారం తన కర్తవ్యాలను తానే నిర్వర్తించాలి; తన దేశానికి ఏ విధానాలు, ఏ పద్ధతులు, ఏ చర్యలు ఉత్తమోత్తమంగా వుంటాయో అదే స్వయంగా నిర్ణయించుకోవాలి.

ఈ సూత్రాలు కొత్తవేమీకాదు. ఇంతకుముందు అనేకసార్లు అవి ఉద్ఘాటించబడినవే. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ రద్దయిననాటినుంచీ అవే సూత్రాలు కమ్యూనిస్టుపార్టీలమధ్య సంబంధాలను తీర్చిదిద్దుతూవచ్చాయి. అయితే కొన్ని సందర్భాలలో, ముఖ్యంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, యూరప్‌లోని నూతన ప్రజాతంత్రదేశాలలోని కమ్యూనిస్టుపార్టీలమధ్య సంబంధాల విషయంలో, ఈసూత్రాల ప్రాధాన్యాన్ని తక్కువ అంచనా వేసి, పెడమార్గం పట్టడం సంభవించింది. ఆ పొరపాటును సరిదిద్దుకోవాలి.

ప్రతికమ్యూనిస్టుపార్టీ తన భుజస్కంధాలపై పడుతున్న గురుతరబాధ్యతలను గుర్తెరిగి ప్రవర్తించాలని పైనపేర్కొన్న విషయాలు స్పష్టం చేస్తున్నాయి. ఏవో కొన్ని పార్టీలు మార్గం చూపుతాయనీ, మిగతా పార్టీలు ఆ మార్గం అనుసరిస్తే సరిపోతుందనీ అనుకోడం శుద్ధ పొరపాటని అవి తేటతెల్లం చేస్తున్నాయి. వివిధ దేశాలలోని పార్టీల మధ్య సరిసమానత్వ సూత్రంపై సంబంధాలు ఏర్పడాలనీ,

ప్రతిపార్టీ సర్వం సహాధికారం కలిగిన స్వతంత్రపార్టీగా వ్యవహరించాలనీ, అంతేకాక ప్రతిపార్టీకీ గల ఈ స్వాతంత్ర్యాన్ని అన్ని పార్టీలు గుర్తించాలనీ యిప్పుడు మరింతగా స్పష్టమవుతున్నది. ♦

సరిసమానత్వం, పరస్పర గౌరవం అనే ప్రాతిపదికపై సోషలిస్టు రాజ్యాలమధ్య, కమ్యూనిస్టుపార్టీల మధ్య సన్నిహిత సహకారం సాధించబడితే, ప్రతిదేశంలోని ఉద్యమం అభివృద్ధి చెందటానికి ప్రపంచమంతటా సోషలిజం, ప్రజాస్వామ్యం బలవత్తరం కావటానికి అది అపారంగా తోడ్పడుతుంది. అందుచేత అలాంటి సహకార సాధక సంబంధాలను పటుతర మొనర్చటంకోసం మేము నిరంతరం కృషిచేస్తూ వుంటాం.

**మార్క్సిజాన్ని విమర్శించినవారు చెప్పినదేసరియైనదనిరుజువైందా?**

సోవియట్ యూనియన్‌లో జరిగిన పొరపాట్లను అవకాశంగా తీసుకొని, మా ప్రత్యర్థులు సోషలిస్టువ్యవస్థను ఖండించేందుకు, మార్క్సిస్టు-లెనినిస్టు ఉపదేశాలను దుయ్యబట్టేందుకు పూనుకొంటున్నారు. మార్క్సిస్టులుకాక, మార్క్సిజాన్ని విమర్శించిన వారే సరియైన వారని చరిత్ర నిరూపించినట్లు వారు గొప్పలు చెప్పుకొంటున్నారు.

---

♦ 1956 జూలైలో సమావేశమైన భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సోవియట్ యూనియన్‌లో వ్యక్తిపూజకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటం గురించి చేసిన తీర్మానంలో ఇలా పేర్కొనబడింది:

"శ్రామికవర్గ అంతర్జాతీయతకు, కమ్యూనిస్టు, కార్మిక పార్టీల మధ్య సౌహార్ద పూర్వక సహకారానికి ఈనాడు మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలపట్ల భక్తి ప్రపత్తులు, సోషలిజం అన్న సమిష్టిలక్ష్యం, శాంతి, ప్రజాస్వామ్యం, జాతీయ స్వాతంత్ర్య రక్షణకొరకు సాగేపోరాటం పునాదిగా వున్నాయి. ఉమ్మడి అనుభవాన్ని ప్రోగుపోసి, పరస్పరం మార్పిడి చేసుకోటం; విమర్శ, ఆత్మవిమర్శ స్వాతంత్ర్యం, వివిధ జాతీయ పార్టీల స్వాతంత్ర్యం ప్రాతిపదికపైన ఈ సహకారం సాధించాలి; అది సోషలిస్టుఉద్యమానికి విధివిహితమైనకర్తవ్యం. ఇలాంటి శ్రామికవర్గ అంతర్జాతీయత ఉమ్మడి బంధనాలను బలవత్తర మొనర్చడానికి భారత కమ్యూనిస్టుపార్టీ శాయశక్తులా పాటుబడుతూంది."

వారు చెప్పుకొనే గొప్పలన్నీ అవిటిపునాదులపై నిర్మితమై యున్నాయి.

సంక్షోభం, నిరుద్యోగం అన్నవి అసలు పారిశ్రామిక వ్యవస్థలోనే గర్భితమైవున్న వేగాని, ప్రత్యేకంగా పెట్టుబడిదారీ విధానం సృష్టించినవి కావని వారు చెప్పారు. వారి మాటలు వట్టి బూటకాలని తేలిపోయింది.

ఒకే దేశంలో-అందులోను ఆర్థికంగా వెనకబడిన దేశంలో సోషలిస్టువ్యవస్థను నెలకొల్పడం అసాధ్యమని వారు అన్నారు. ఈ విషయంలో కూడా వారి మాటలు నీటిమూటలని స్పష్టమై పోయింది.

సమిష్టి వ్యవసాయాన్ని రైతాంగం ఎన్నడూ బలపర్చ బోదని వారు వాదించారు. పంచవర్ష ప్రణాళిక విఫలమై పోతుం దన్నారు. సోవియట్ యూనియన్‌పై హిట్లరు దండెత్తినప్పుడు, ఇక చూడండి, సోవియట్ వ్యవస్థ పేకముక్కలతో నిర్మించిన మేడ వలె కూలిపోతుందని వారు జోస్యం చెప్పారు. యూరప్‌లో మాట ఎలావున్నా ఆసియాలో మాత్రం ప్రజలు మార్క్సిజం-లెనినిజాన్ని ఏ దేశంలోనూ ఆమోదించబోరని వారు చెప్పారు. సోషలిస్టు రాజ్యాలుకూడా సామ్రాజ్యవాద మాదిరిగానే దురాక్రమణ రాజ్యాలనీ, అవి యుద్ధానికై కుట్రలు పన్నుతున్నాయనీ వారు వాదించారు. వారు చెప్పిన విషయాలు యింకా అనేకంవున్నాయి. వాటన్నిటినీ ఇప్పుడు వారు మరొకసారి గుర్తుకు తెచ్చుకుంటే మంచిది.

పైన పేర్కొన్న ఏ ఒక్క విషయంలోనైనా వారు చెప్పినట్టు జరిగిందా? అలా జరగకపోగా, వారు చెప్పిన దానికి విరుద్ధంగా జరగలేదా?

అనేక సందర్భాలలో మా అవగాహన లోపభూయిష్టంగాను సమస్యను చులకనచేసేదిగాను, చివరకు తప్పుడుగాను వున్నదన్న విషయం అంగీకరించటానికి మేము వెనుదీయం. అయితే గత

కొలది దశాబ్దాలలోను జరిగిన ఘటనలను వాస్తవిక దృష్టితో పరిశీలిస్తే మాత్రం, ప్రపంచ పరిస్థితిని అంచన వేయటంలో ఇతరులందరి అవగాహనకంటే కమ్యూనిస్టుల అవగాహన సరిగా వున్నదని రుజువుకాక మానదు; వివిధ శక్తుల బలాబలాలను, ప్రపంచంలోగల విభిన్న ధోరణులను అంచనా వేయటంలోను, శ్రామిక ప్రజలు అధికారం హస్తగతం చేసుకొని సోషలిజాన్ని స్థాపించటానికి సరియైన మార్గమేదో చూపించటంలోను కమ్యూనిస్టులే ఇతరులకన్నా సరియైన అవగాహన పరులై యున్నారన్న సంగతి ధృవపడక మానదు.

ప్రపంచంలో మూడోవంతు భాగంలో సోషలిజం జయప్రదం కావటానికి దారితీసిన పోరాటాలలో కమ్యూనిస్టులు నాయకత్వ పాత్రను, నిర్ణయాత్మక పాత్రను నిర్వర్తించారు. ప్రతి దేశంలోను దోపిడీకి, పీడనకు వ్యతిరేకంగా వారు ముందుశ్రేణిలో నిలబడి పోరాడుతున్నారు. ఫాసిజానికి, యుద్ధానికి వ్యతిరేకంగా సాగించబడిన సమరంలో వారు అగ్రశ్రేణిలో నిలబడి పోరాడారు. నూతన జీవితాన్ని సంతరింపచేసుకొనేందుకు మానవజాతి సాగిస్తున్న పోరాటానికి 5 కోట్లమంది కమ్యూనిస్టులు నైతాళికులై ముందుకు సాగుతున్నారు.

జాతీయ పీడనను, జాతివివక్షతను కమ్యూనిస్టులు దృఢసంకల్పంతో ప్రతిఘటిస్తున్నారు; శ్రామికవర్గ అంతర్జాతీయ పతాకాన్ని చేబూని, ప్రపంచంలోని శ్రమజీవులందరినీ సమైక్యం చేసేందుకు శక్తివంచన లేకుండా వారు కృషిసల్పుతున్నారు. ఉమ్మడి పోరాటంలో దేశదేశాల ప్రయోజనాలను కాపాడుతూ, వివిధ దేశాల ప్రజలమధ్య సౌహార్ద సహకార సాధనకు వారు అచంచలంగా పాటుబడుతున్నారు.

కాగా, మమ్మల్ని విమర్శించేవారు – మార్క్సిజం – లెనినిజాన్ని విమర్శించేవారు – తాము స్వయంగా సాధించిన విజయాలేమిటో చెప్పగలరా ? తాముకూడా వర్గరహిత సమాజస్థాపన

కోసమే కృషిచేస్తున్నామని చెప్పుకొనే ప్రజాస్వామిక సోషలిస్టులు సోషలిజం విజయవంతం కావటానికి వాస్తవంగా చేసిందేమిటి? తాము అధికారంలోకి వచ్చిన దేశాలలో వారు చేసింది ఏమిటి?

బ్రిటనులో అనేకసార్లు లేబరుపార్టీ ప్రభుత్వం ఏర్పడింది. ప్రతిసారీ ఎన్నికలలో ప్రజలకు చేసిన వాగ్దానాలను అది ఉల్లంఘిస్తూనేవచ్చింది. 1948 లో జరిగిన ఎన్నికలలో బ్రిటిషు లేబరు పార్టీకి అత్యధిక మెజారిటీ స్థానాలు లభించాయి. అప్పుడు ఆ దేశ కార్మికులు లేబరుపార్టీ తమకు ఎంతో ఒరగబెడుతుందని ఆశపడ్డారు. 1951 నాటికి, అంటే లేబరుపార్టీ 6 సంవత్సరాలపాటు అధికారంలోవున్న తర్వాత, మొత్తం జాతీయ ఆర్థికవ్యవస్థలో అయిదో వంతు మాత్రమే జాతిపరమొనర్చబడింది. దేశంలోని మొత్తం పారిశ్రామిక సంస్థలలో 2 కోట్ల 10 లక్షల మంది కార్మికులు పని చేస్తుంటే, వారిలో 25 లక్షలమంది పనిచేస్తున్న పారిశ్రామికసంస్థలను మాత్రమే లేబరుపార్టీ జాతీయంచేసింది. పైగా విపరీతమైన లాభాలువచ్చే పారిశ్రామిక సంస్థలజోలికి పోనేలేదు. 1944–1950 మధ్యకాలంలో బ్రిటన్‌లో వడ్డీరూపేణా, లాభాల రూపేణా ధనస్వాములు గడించిన మొత్తం జాతీయాదాయంనూటికి 32 వంతుల నుంచి 35 వంతులకు పెరిగింది. కాగా, సైనికుల వేతనం నూటికి 47 వంతులనుంచి 43 వంతులకు తగ్గింది.

సోషలిస్టు సూత్రాలకు విద్రోహం తలపెట్టిన బ్రిటిషులేబరు పార్టీని భారత సోషలిస్టుపార్టీ ఖండించలేదన్నసంగతి ఈ సందర్భంలో గమనార్హం. పైగా సోవియట్ యూనియన్‌ను దుయ్యబట్టటంలో సదా సిద్ధం సుమతీ అంటూ ముందుకు వచ్చే శ్రీ అశోక మెహతా ఆ విద్రోహాన్ని ఈ క్రింది విధంగా సమర్థించారు.

"పొదుపరితనం అలవర్చుకొని, కష్టాలు భరించటానికి సిద్ధం కావాలని ప్రజలకు చెప్పటం విషయంలో సర్ స్టాఫర్డ్‌క్రిప్స్ఎన్నడూ జంకలేదు. అదే ఆయనకు కలకాలం ఖ్యాతిగా వెలుగొందు

తుంటుంది. బ్రిటిషు ప్రజలు ప్రజాస్వామిక దృష్టితో పొదుపరితనం అలవర్చుకొని, కష్టాలు సహించారు. అదే వారి గొప్పతనం”

[అశోక మెహతా “ప్రజాస్వామిక సోషలిజం” 127 పేజీ]

బ్రిటిషు ప్రజలు విధిలేక “పొదుపరితనం” ఎందుకు “అలవర్చుకోవలసి” వచ్చిందో అందరికీ తెలుసు. యుద్ధంవల్ల అసలే వారి ఆర్థిక జీవనం దెబ్బతినిపోయింది. పైగా అమెరికన్ సామ్రాజ్యవాదులు బలవంతాన వారి నెత్తిన ఆయుధధారణ భారం వేశారు; అదీకాక, వలసయుద్ధాల దుష్ఫలితాలను వారు అనుభవించవలసి వచ్చింది.

బ్రిటిషు లేబరుపార్టీ అధికారంలో వున్నప్పుడు, యుద్ధానికి పూర్వమూ, తర్వాతకూడా భారత, మలయా, ఆఫ్రికా, తదితర బ్రిటిషు వలసప్రాంతాలన్నింటిలోను ప్రజల విమోచనోద్యమాన్ని రక్తపుటేరులలో ముంచెత్తటంలో కన్సర్వేటివ్‌లతో పోటీపడింది.

ప్రజాస్వామ్య సోషలిజాన్ని స్వీకరించామని చెప్పుకుంటున్న ఫ్రెంచి సోషలిస్టులుకూడా యిలాగే వ్యవహరిస్తున్నారు. పరిశ్రమలను జాతిపరమొనర్చే కార్యక్రమాన్ని అమలు జరపటానికి వారు నిరాకరించారు. ఆల్జీరియా ప్రజల స్వాతంత్ర్య పోరాటాన్ని వారు యిప్పటికీ అణచివేస్తూనే ఉన్నారు. సర్వసహాధికారం గల ఈజిప్ట్ రిపబ్లిక్ విషయంలో వారు హంతకుల వలె ప్రవర్తించారు.

పోతే భారత ప్రభుత్వం విషయం ఏమిటో పరిశీలిద్దాం. భారత ప్రభుత్వాధినేత శ్రీ నెహ్రూ మార్క్సిజానికి కాలదోషం పట్టిందంటూ చీటికీమాటికీ పునరుచ్చరణ చేస్తున్నారు. కమ్యూనిస్టులు దౌర్జన్యోపాసకులని లేనిపోని ఆరోపణలు చేసూ, విసుగు విరామంలేకుండా ఖండిస్తున్నారు.

సోవియట్ యూనియన్‌లో జరిగిన పొరపాట్లను సాకుగా తీసుకుని, తన ఎన్నికల ప్రచారంలో అంతర్భాగంగా భారత కమ్యూనిస్టుపార్టీని ఆయన ఖండిస్తున్నారు.

## భారత ప్రభుత్వం చెప్పేమాటలు, చేస్తున్నపనులు

1947 లో భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి నప్పుడు, దాని ఆర్థిక వ్యవస్థ దళితస్థితిలోనే వున్నప్పటికీ, యుద్ధంవల్ల సర్వనాశనమైపోయి మాత్రంలేదు. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు అండదండలు భారత ప్రభుత్వానికి లభించాయి. స్వాతంత్ర్య పోరాట కాలంలో బ్రిటిషు సామ్రాజ్యవాదుల అండజేరిన భూస్వాములు, అభివృద్ధినిరోధకశక్తులు నైతికంగాను, రాజకీయంగాను ప్రజలకు దూరమైపోయాయి. కాంగ్రెసు అధికారాన్ని సవాలు చేయగల్గిన స్థితిగానీ, పేరుప్రతిష్టల విషయంలో కాంగ్రెసుతో సరితూగగల్గిన రాజకీయ పక్షంగానీ మరొకటిలేదు.

అంత అధికారం, పేరుప్రతిష్టలు, ప్రజల అండదండలు గల కాంగ్రెసు ప్రభుత్వం సాధించింది ఏమిటి?

అనేక సంవత్సరాలపాటు బ్రిటిషు సామ్రాజ్యవాదుల ప్రాబల్యానికి లోనైన వైదేశిక నీతిని అది అనుసరించింది. దాని పర్యవసానంగానే కొరియాలో సామ్రాజ్యవాదుల జోక్యాన్ని మన ప్రభుత్వం సమర్థించింది. మన జాతీయ గౌరవానికి, జాతీయ ప్రయోజనాలకు విరుద్ధమైన అనేక చర్యలను మన ప్రభుత్వం గైకొన్నది. అటు తర్వాత పాత వైదేశిక నీతికి భిన్నమైన వైదేశిక విధానాన్ని భారత ప్రభుత్వం చేబట్టిన ఫలితంగా ప్రపంచంలో మనదేశ ప్రతిష్ట అపారంగా పెరగటం చూస్తున్నాం. అంతే అంతకుపూర్వం అనుసరించిన విధానం పూర్తిగా ఎలా పొరపాటైనదో మనకు స్పష్టంకాకమానదు.

అయితే నేటికీ, జనపనార, బొగ్గు, టీవంటి వాటి విషయంలోను, మన ఆర్థిక వ్యవస్థలోని తదితర రంగాలలోను బ్రిటిషు పెట్టుబడులు పెత్తనం చలాయిస్తున్నాయి. పెట్టుబడిదారీ గుత్తాధిపత్యం పెచ్చుపెరిగిపోయింది. 1953 లో మొత్తం జాయింట్ స్టాక్ కంపెనీలలో నూటికి 1.2 వంతులుగా గల పెద్ద పెద్ద కంపెనీలు,

మొత్తం చెల్లించబడిన పెట్టుబడిలో నూటికి 38.2 వంతులు కలిగి యున్నాయి. కాగా, మొత్తంకంపెనీలలో నూటికి 88.1 వంతులుగా గల చిన్న చిన్న కంపెనీలకు మొత్తం చెల్లించబడిన పెట్టుబడిలో నూటికి 20 వంతులు మాత్రమేవుంది. ఇక బ్యాంకింగ్ రంగాలలో పరిస్థితి ఎలా వుందో చూదాం. 8 పెద్ద బ్యాంకులు – అంటే మొత్తం బ్యాంకులలో వాటిసంఖ్య 1.6 శాతం మాత్రమే-మొత్తం పెట్టుబడి, రిజర్వు నిధులలో నూటికి 70 వంతులు కలిగియున్నాయి. లాభాలలో నూటికి 64.5 వంతులు వాటికేదక్కాయి. 1950–1954 మధ్యకాలంలో ఫ్యాక్టరీలు సంపాదించిన లాభాలు, అద్దెలు, వడ్డీలు మొత్తం ఆదాయంలో నూటికి 58 వంతులనుంచి 67 వంతులకు పెరిగాయి. కాగా, కార్మికులవేతనాలు నూటికి 42 వంతులనుంచి 33 వంతులకు తరిగిపోయాయి. 1952–1955 మధ్యకాలంలో పారిశ్రామిక లాభాలు 190.6 నుంచి 319.6 కి పెరిగాయి. ఒక ప్రక్క లాభాలు పెరుగుతున్నా, ఉత్పత్తి హెచ్చుతున్నా పారిశ్రామిక పనివారి సంఖ్యమాత్రం పెరగలేదు. పైగా 1953–1954 మధ్య కాలంలో కొంత తగ్గిపోయిందికూడా.

పన్నులరూపంలోవసూలుచేయబడుతున్న మొత్తంలోప్రత్యక్ష పన్నులద్వారా వసూలుచేయబడున్న ధనం 1944–45 లో నూటికి 45 వంతులు వుండగా, 1955 లో నూటికి 24 వంతులు మాత్రమే వుంది. అంటే పన్నులభారం అంతకంతకు పేదప్రజల నెత్తిన పడుతోందనీ, ధనవంతులపై ఆ మేరకు తగ్గించబడుతోందనీ స్పష్టమవుతోంది.

ఎన్ని మాయమాటలు చెప్పినా సర్వోదయం, సోషలిస్టు నమూనా సమాజం అంటూ ఎన్ని కల్లబొల్లి కబుర్లు చెప్పినా ఈ వాస్తవ విషయాన్ని మభ్యపర్చటం మాత్రం సాధ్యంకాదు.

రైతాంగ ప్రయోజనాలకోసం పనిచేస్తున్నట్లు చెప్పుకొనే కాంగ్రెసు, రైతుల అండదండలతో అధికారంలోకి వచ్చిన కాంగ్రెసు రైతు ప్రజా సామాన్యానికి చేసినది ఏమిటో చూదాం.

ఈనాటికి కూడా మొత్తం సాగు అవుతున్న భూమిలో 15.5 వంతులు మాత్రమే రైతాంగంలో నూటికి 60 వంతులుగాగల పేదప్రజల చేతుల్లోవుంది. కాగా నూటికి 5 వంతులుగాగల భూస్వాముల చేతుల్లో మొత్తం సాగవుతున్న భూమిలో నూటికి 34 వంతులున్నది. గత కొలది సంవత్సరాలలోను లక్షలాది కౌలుదారులు భేదఖలు చేయబడ్డారు. ఈ బేదఖళ్ళను కమ్యూనిస్టులు, సోషలిస్టులు మాత్రమేకాక, భూదాన కార్యకర్తలు కూడా తీవ్రంగా ఖండించారన్న విషయం గమనార్హం. గ్రామీణ ప్రాంతాలలోని పరిస్థితులను పరిశీలించిన పన్నుల విధాన పరిశీలక సంఘం తమ నివేదికలో పెద్దపెద్ద భూస్వాముల స్థితిగతులు బాగుపడ్డాయనీ, కాగా వ్యవసాయ కూలీల, బేదఖలు చేయబడి ఖబ్జా లేని కౌలుదారుల, చేతి పరిశ్రమదారుల పరిస్థితులు ఇంకా దిగజారిపోయాయనీ వ్రాశారు.

భూసంబంధాలలో రక్తరహిత విప్లవం సాధించామని కాంగ్రెసువారు గొప్పలు చెప్పుకొంటున్నారు. వాటిలో వాస్తవమేమన్నా వున్నదా అని రైతుసంఘాలు, నిజాయితీపరులైన కాంగ్రెసువాదులు, సర్వోదయ కార్యకర్తలు అనేకసార్లు పరిశీలించారు. ఉత్తర ప్రదేశ్‌లో వాస్తవంగా జరిగిన పరిణామాలను గురించి లోతుగా పరిశీలించినవ్యక్తి ఏమంటున్నాడో చూడండి :

"ఒక్కమాటలో చెప్పాలంటే, ఉత్తర ప్రదేశ్ జమీందారీ రద్దు చట్టంవల్ల కొత్తరకం పట్టాదారులవర్గం ఒకటి తలెత్తింది; పాత పట్టాదారుల వర్గానికీ, ఈ కొత్తవర్గానికీ తేడావున్నట్లేమీ కన్పించదు. పైన భూమిదారులు, వారిక్రింద సర్దార్లు, వారిక్రింద ఆసామీలూ వున్నారు. కాగా, మక్తాదారులు, వ్యవసాయకూలీలు అట్టడుగున వున్నారు. జమీందారులు అదృశ్యమైపోయినమాట నిజమేకాని తిరిగి వారే భూస్వాములుగా ప్రత్యక్షమయ్యారు. మంచిరకం భూఖండాలన్నీ వారి హక్కుభుక్తంలో మిగిలిపోయాయి. ప్రభుత్వానికీ — రైతులకూ మధ్య దళారీలను అనుమతించనిమాట నిజమే అయినా, వ్యవసాయకూలీలను

పెట్టుకొనటంద్వారా తమ భూములను సాగుచేసుకొంటే 'సాగు దార్లు' అయిపోవచ్చు; లేదా తమ భూములను మక్తాకు యిచ్చుకోవచ్చు. రైతాంగంలో అధికసంఖ్యాకులు 'సర్దారులు' అని పిలువబడుతున్నారు; వారిస్థితి యింతకుపూర్వం మాదిరిగానే వుంది; వారు చెల్లించే కౌలుకూడా యింతకుపూర్వంవలెనే వుంది. పూర్వం కౌలును జమీందారు వసూలుచేస్తే, యిప్పుడు ప్రభుత్వం వసూలు చేస్తోంది. అదే గతానికీ, యిప్పటికీ గల తేడా (డేనియల్ థార్నర్: భారతదేశంలో వ్యవసాయరంగం భవిష్యత్తు ; 25 వ పేజీ).

ఉత్తరప్రదేశ్ శాసనసభలో 1956 సెప్టెంబరు 25 వ తేదీన రెవెన్యూ మంత్రి శ్రీ శరణ్ సింగ్ ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ, "రాష్ట్రంలో సాగవుతున్న మొత్తం భూమిలో నూటికి 33 వంతులు భూస్వాముల అధీనంలోవుంది. భూమిదారులలో సగంమంది పాత జమీందారులు; మిగతా సగంమంది పదిరెట్లు నష్టపరిహారం చెల్లించటంద్వారా భూమిదారీ హక్కులను సంపాదించుకొన్నారు" అని వివరించారు.

మనదేశంలో గ్రామీణ ప్రాంతాలలో దోపిడీవర్గాల అధికారం, పలుకుబడి ఎలావున్నాయో రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా వారు తయారుచేసిన "గ్రామీణ ఋణస్థితిగతులు" అన్న నివేదికలో స్పష్టంగా చూడవచ్చు. ప్రభుత్వ విధానాలు అనేకం ఎందుకు అమలుజరగటంలేదో, ప్రభుత్వం జారీచేసిన అనేక ఉత్తరువులు ఎందుకు కాగితంపైన మాత్రమే మిగిలిపోతున్నాయో అందులో స్పష్టీకరించారు.

"వడ్డీవ్యాపారునికిగల అవకాశాలన్నీ బడాభూస్వామికి కలవు. నిజానికి అతడు వడ్డీవ్యాపారస్తుడుగాను, మామూలు వ్యాపారస్తుడుగానుకూడా వ్యవహరిస్తున్నాడు. ఈ విషయం ఇంతకుముందే పేర్కొన్నాము. గ్రామాధికారికూడా ఆ వర్గానికే చెందివుంటాడు. ఆర్థికంగానేకాక, పరిపాలనాధికారరీత్యాకూడా

వారిమధ్య సన్నిహితసంబంధా లుంటాయి. క్రిందితరగతి ఉద్యోగులు, రివెన్యూ, తదితరఉద్యోగులు — సహకారసంఘాలలో తక్కువజీతంగలవారితోసహా— తనిఖీకి గ్రామాలకు వచ్చిన సందర్భంలో భోజన, తదితర సదుపాయాలకోసం వారిపైన ఆధారపడతారు. ఈవిధంగాను, ఇతరవిధాలకూడా గ్రామాధికారులతోను, గ్రామపెత్తందారులతోను ఆ ఉద్యోగులకు సంబంధాలు ఏర్పడతాయి. ఆ విధంగా మామూలు గ్రామస్తులకు అందుబాటులో లేని, పట్టణాలలోవుండే స్థానిక పరిపాలనా యంత్రాన్ని వారు తమ స్వప్రయోజనానికి ఉపయోగించుకోగల్గుతున్నారు. క్రిందితరగతి ప్రభుత్వోద్యోగులకు, గ్రామాలలోని బలీయమైన శక్తులకు మధ్య సన్నిహిత సంబంధం, లావాదేవీలు ఏర్పడుతున్నాయి. పరిపాలనా యంత్రంలోని పై అంతస్థునుంచి రూపొందించబడుతున్న విధానాలు, జారుచేయబడుతున్న ఉత్తర్వులు అమలుజరగకపోవటానికి ముఖ్య కారణం యిదేనన్న విషయం గుర్తించాలి." (అఖిలభారత గ్రామీణ రుణస్థితిగతుల సర్వే: రిపోర్టు ఆఫ్‌ది కమిటీ ఆఫ్ డైరెక్షన్, ది జనరల్ రిపోర్టు, 277 వ పేజీ)

ఆస్తిసంబంధాలలో సమూలమైన మార్పులు తీసుకురానిదే నిజమైన ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పటం సాధ్యంకాదని అత్యంత ఉన్నతాధికార సంఘంవారే పైవిధంగా అంగీకరిస్తున్నారు. కాంగ్రెసు అమలుజరిపిన వ్యవసాయసంస్కరణలు అలాంటి మార్పులు తీసుకురాలేకపోయాయి. కనుకనే రైతులపై భారం ఏమాత్రం తగ్గలేదు; గతంలోని పరిపాలనాసంబంధమైన దుస్సంప్రదాయాలు సమసిపోలేదు.

మధ్యతరగతి ఉద్యోగులు - బ్యాంకు, ఇన్సూరెన్సు ఉద్యోగులు, గుమాస్తాలు, ఉపాధ్యాయులు, తదితరులు - ఎన్నో యిబ్బందులకు లోనవుతున్నారు; ఏ క్షణాన తమను పనులనుంచి తొలగించి వేస్తారోనని వారు ఆందోళన చెందుతున్నారు; వారికి అధికవేతనాలు

యివ్వ నిరాకరిస్తున్నారు; వారు అర్ధాకలితో జీవితం గడుపుతున్నారు.

నిరుద్యోగసమస్య తీవ్రరూపం ధరించింది. పిల్లలకు చదువు చెప్పించుకోటం తలకుమించిన బరువుగా తయారైనందున ప్రజలు తమ పిల్లలకు చదువు చెప్పించుకోలేకపోతున్నారు. *

---

* ప్రభుత్వం చెప్పుకొంటున్న గొప్పలకు, వాస్తవిక విషయాలకు సామ్యమే కన్పించదు. చివరకు అధికార ప్రచురణలలోకూడా అప్పుడప్పుడు వాస్తవ విషయాలు అంగీకరించబడటం కద్దు. 1955 డిసెంబరు 27 వ తేదీన ప్రకటించబడిన రెండో పంచవర్ష ప్రణాళిక ముసాయిదా మెమోరాండంలో యీనాడు జాతీయాదాయ పంపిణీ తీరుతెన్ను లెలావున్నాయో, భవిష్యత్తులో ఎలా వుండబోతాయో వివరిస్తూ యిలా పేర్కొన్నారు:

"అనేక దేశాలలో సమాజం ధనవంత మవుతున్నకొలదీ హెచ్చు ఆదాయం వచ్చేవారి చేతిలోకిపోయే జాతీయ సంపద క్రమంగా సన్నగిల్లుతోంది. జాతీయ సేవాకార్యక్రమం, జాతీయ భద్రతా చర్యలు మున్నగువాటి విస్తరణ ద్వారా తక్కువ ఆదాయాలు వచ్చేవారి నికర ఆదాయం పెరుగుతోంది. తక్కువ ఆదాయాలు వచ్చేవారి వాటా, ఒక మోస్తరు ఆదాయాలు వచ్చేవారి వాటా పెరిగింది. "సరిసమాన వాటకం అన్న ఆదర్శం" వైపు క్రమానుగతమైన పురోగమనం సాధించబడుతోంది. భోగలాలస జీవితంగానీ, యమయాతనల బ్రతుకుగానీ, దోగిష్టి బ్రతుకుగానీ అంతగా లేకుండాపోయాయి. రాబడులలో వ్యత్యాసం తగ్గిపోవటంతోపాటు, జీవన ప్రమాణాలలోని వ్యత్యాసంకూడా అంతకన్నా ఎక్కువగా తగ్గిపోయాయి. భారతదేశంలోని పరిస్థితిమాత్రం అలా లేదు. భారతదేశంలో కొన్ని చారిత్రక పరిస్థితులవల్ల అసమాన ఆర్థికాభివృద్ధి సాధించబడింది. అందుచేత ఆస్తి, ఆదాయాలలోను, జీవన, సాంస్కృతిక స్థాయిలలోను గల వ్యత్యాసాలు, ముఖ్యంగా రెండో ప్రపంచ యుద్ధ కాలంలో పట్టణప్రాంతాలలో యింకా యితోధికమైపోయాయి. ఎక్కువభాగం ఉత్పత్తి ప్రయివేట్ రంగానికి వదలివేయబడుతున్నందువల్లనూ, పన్నులు, అప్పులు, చిన్నమొత్తాల పొదుపు ఉద్యమం మున్నగు రూపాలలో రాబట్టే డబ్బు స్వల్పప్రమాణంలోనే వుంటున్నందుననూ, రెండో పంచవర్ష ప్రణాళికాకాలంలో అభివృద్ధి కార్యక్రమానికి వెచ్చించబడుతున్న వ్యయం కారణంగా ఎక్కువ ఆదాయం వచ్చేవారికి, తక్కువ ఆదాయం వచ్చేవారికి మధ్యగల తేడా యితోధిక మవుతుంది." (ముసాయిదా మెమోరాండం: 3 వ అధ్యాయం, 7 వ పేజీ - వక్కాణింపు రచయిత).

పోతే పౌరస్వాతంత్ర్యాల విషయంలో కూడా ప్రభుత్వప్రవర్తన శోచనీయంగానే వుంది. కాంగ్రెసు అధికారంలోకి వచ్చిన తొలి సంవత్సరాలలో దేశంలోను, శాసనసభలలోను సుసంఘటితమైన ప్రతిపక్షం లేకపోవటంవల్ల పాలకపక్షం ప్రజలపైన హింస, దౌర్జన్యపూరిత చర్యలను అమలుజరిపింది. తాము కష్టించి, సృష్టించుతున్న సంపదలో హెచ్చుభాగం తమకు రావాలని శ్రామికప్రజలు కోరినప్పుడు, తమ జీవనపరిస్థితులను మెరుగు పర్చమని గొంతెత్తి అడిగినప్పుడు, ఒకప్పుడు కాంగ్రెసుసంస్థే ఎలుగెత్తి చాటిన హక్కులను ప్రజలు కోరినప్పుడు— ఈ అన్ని సందర్భాలలోను ప్రజావాంఛను బలవంతాన అణచివేసేందుకు

---

మన సోషలిస్టు నమూనా సమాజం గురించి యింతకన్న చక్కని వ్యాఖ్యానం యింకా కావాలా? వాస్తవిక పరిస్థితులను ఇంత చక్కగా వివరించటం అధికారవర్గాలకు ఏమాత్రం రుచించలేదు. కనుకనే అటుతర్వాత వెలువడిన ప్రచురణలలో ఈ విషయం పూర్తిగా వదలివేశారు.

వ్యవసాయ సంస్కరణల విషయంలోకూడా ప్రభుత్వం చెప్పుకొంటున్న గొప్పల బండారమేమిటో బయటపెట్టే చక్కని అంశాలు కొన్ని ఆ ముసాయిదా మెమోరాండంలోనే ఉన్నాయి.

"రాష్ట్రాలలో వ్యవసాయ సంస్కరణల చట్టాలు ప్రధానంగా భూకామందులకు, కౌలుదారులకుమధ్యగల సంబంధాలకుమాత్రమే పరిమితమై వున్నాయి. అనేక రాష్ట్రాలలో కౌలు హక్కు భద్రపర్చబడిన విషయమూ, కౌలు రేటు తగ్గించబడిన విషయమూ వాస్తవమే అయినప్పటికీ, కౌలుదారులకు పట్టాహక్కులు ఒసగటంలో మాత్రం ఆలస్యం జరుగుతోంది. అనేక రాష్ట్రాలలో చిన్నభూకామందులకు, కౌలుదారులకు మధ్య తగవులు తీర్చటం చిక్కుసమస్యగా పరిణమించింది. భూమిలేని వ్యవసాయ కూలీలకు భూవసతి చేకూర్చిపెట్టే విషయంలో చెప్పుకోదగిన కృషి జరగనేలేదు. సహకార వ్యవసాయ క్షేత్రాలు, గ్రామ వ్యవహారాలను సహకార పద్ధతులలో నిర్వహించటం విషయంలో మనసులేని మనువు తంతుగా కృషిసాగించబడుతోంది; ఈ విషయంలో జరిగిన కృషి కూడా నామమాత్రంగానే వుందని చెప్పాలి. ప్రభుత్వ శాఖలు సమర్థవంతమైన చర్యలు తీసుకోనందువల్లను, గ్రామస్థాయిలో నిర్మాణం బలహీనంగా వున్నందువల్లనూ వ్యవసాయ సంస్కరణ చట్టాలవల్ల సర్వత్రా ఆశించినంత ఫలితం సమకూడనే లేదని చెప్పాలి. (అదే నివేదిక; నాల్గవ అధ్యాయం, 15వ పేజీ)

కాంగ్రెసుప్రభుత్వం ప్రయత్నించింది. 1947 ఆగస్టు అనంతరం మూడుసంవత్సరాలకాలంలో, 50 వేలమంది రాజకీయ ప్రత్యర్థులను కాంగ్రెసు ప్రభుత్వం బందిఖానాలలో నిర్బంధించింది; 3750 మందిని— వారిలో 82 మందిని జైలుఆవరణలో— కాల్చి చంపింది; 10 వేల మందిని గాయపర్చింది. కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. సమరశీల కార్మికసంఘాలు, రైతుసంఘాలు పనిచేయకుండా ఎన్నో నిర్బంధాలు ప్రయోగించింది.

ఈ విధానాలన్నింటి పర్యవసానంగా గత ఎన్నికలలో కాంగ్రెసు పెద్ద దెబ్బతిన్నది. దేశం మొత్తంమీద పోలైన ఓట్లలో కాంగ్రెసుకు నూటికి 45 వంతులు మాత్రమే వచ్చాయి. ప్రభుత్వం కక్షకట్టి, ఎలాగైనాసరే అణచివేయాలని చూసిన కమ్యూనిస్టుపార్టీ రెండో పెద్దపార్టీగా ప్రత్యక్షమైంది.

అటుతర్వాత సంవత్సరాలలో ప్రభుత్వ విధానాలలో కొన్నిమార్పులు వచ్చాయి. అందుకు ఈ క్రింది అంశాలు కారణమని చెప్పవచ్చు: ప్రజాశక్తి బలపడింది. ప్రభుత్వ విధానాలను ప్రజలు గట్టిగా ఎదిరించసాగారు. శాసనసభలలోను, బయట కూడా ప్రజాప్రతినిధులు ప్రభుత్వ చర్యలను ప్రతిఘటించసాగారు. దేశంలోను, చివరకు కాంగ్రెసులోపల ప్రజాస్వామ్య చైతన్యం వృద్ధిచెందింది. ప్రపంచ సోషలిస్టు, ప్రజాస్వామిక శిబిరం బలవత్తరమైంది; ఆ శిబిరంయొక్క ప్రభావం భారతదేశంపై ప్రసరించింది. ఒకప్రక్క భారత బూర్జువా వర్గానికి, మరొకప్రక్క సామ్రాజ్యవాదులు, వారి వెనకాలవున్న ఫ్యూడల్ శక్తులకు మధ్య వైరుధ్యం తీవ్రతరమైంది. ఈ కారణాలన్నింటివల్ల ప్రభుత్వ విధానాలలో కొన్ని మార్పులు వచ్చాయి.

అయితే యింతకుముందు పేర్కొన్న సంఖ్యావివరాలనుబట్టి చూస్తే కమ్యూనిస్టుపార్టీ రాజకీయ తీర్మానంలో పేర్కొన్నట్లు, దేశీయ విధానాలలో వచ్చినమార్పులు ఏమాత్రం సరిపోవని చెప్పవలసివుంటుంది. భూస్వాములతో రాజీపడే విధానాన్ని, విదేశీ

పెట్టుబడులకు సౌకర్యం కల్పించే విధానాన్ని, కార్మికవర్గానికి, ప్రజాసామాన్యానికి వ్యతిరేకంగా గుత్తాధిపత్య సంస్థలు సాగించే దాడులను బలపరచేవిధానాన్ని ప్రభుత్వం యింకా విడనాడలేదు. భాషాప్రయుక్త రాష్ట్రవాంఛను అణచటంకోసం బొంబాయిలోను, అహ్మదాబాద్‌లోను ప్రభుత్వం దారుణమైన తుపాకి కాల్పులకు ఒడిగట్టింది. కాన్పూర్, డార్జిలింగ్‌లలోను, ఒరిస్సాలోని బార్బిల్, బెంగాల్, బీహార్‌లోని బొగ్గుగనులలోను కార్మికులపై దారుణమైన దమననీతిని ప్రయోగించింది. విదేశీ పారిశ్రామిక సంస్థలు ఆర్జించిన లాభాలను, కనీసం విదేశాలకు పోనీయకుండా అరికట్టటానికి సహితం ప్రభుత్వం నిరాకరిస్తోంది. రెండో పంచవర్ష ప్రణాళికలో వ్యవసాయ సంస్కరణలు మనసులేని మనువు అన్నట్టున్నాయి. పైగా వాటినికూడా అనేక రాష్ట్రప్రభుత్వాలు తూట్లుపొడుస్తు న్నాయి. ప్రభుత్వం అనుసరిస్తున్న ద్రవ్యవిధానంవల్ల ధరలు విపరీతంగా పెరిగిపోయాయి. ఇవన్నీకూడా పైన పేర్కొన్న విషయాన్నే ధృవీకరిస్తున్నాయి.

అయితే, గతంలో తానుచేసిన పొరపాట్లలో ఏ ఒక్కదానికి కూడా భారత ప్రభుత్వం అంగీకరించదలచుకోలేదు. కొరియాలో సామ్రాజ్యవాదుల జోక్యాన్ని బలపర్చటం తప్పఅన్న విషయం గానీ, సామ్రాజ్యవాదులు శాంతిప్రియులే అన్న తమ తొలివిశ్వాసం పొరపాటన్న విషయంగానీ, భారత భూభాగంలో గూర్ఖాలను రిక్రూట్ చేసుకోటానికి బ్రిటిషువారికి అనుమతిస్తూ, తద్వారా మలయా ప్రజల పోరాటాన్ని అణచటానికి వీలు కల్పించటం మన జాతీయ సాంప్రదాయాలకు, మన సర్వంసహాధికారానికి విరుద్ధమన్న విషయంగానీ కాంగ్రెసు ప్రభుత్వం అంగీకరించ దలచుకోలేదు.

మేము ఎలాంటి హింసాచర్యకు కూడా పూనుకోకముందే, 1948 లో కమ్యూనిస్టుపార్టీని నిషేధించటంగానీ, తెలంగాణాలోను, బెంగాలులోను జరిపిన తుపాకికాల్పులుగానీ, ప్రజారక్షణచట్టాన్ని

హద్దూపద్దూలేకుండా ఉపయోగించటంగానీ పూర్తిగా పొరపాటన్న విషయం ఒప్పుకోటానికి ప్రభుత్వం నిరాకరిస్తోంది. ఈ పనులన్నీ ఏవిధంగానూ సమర్థించ వీలు లేనివి.

1955 ఆగష్టులో పాట్నాలో జరిగిన అల్లరులకు కమ్యూనిస్టులే కారకులంటూ (శ్రీ) నెహ్రూ ఆరోపించారు. కాని, న్యాయ విచారణ సందర్భంలో ఆ అల్లరులకు పోలీసు ప్రవర్తనే కారణమని నిరూపితమైంది. అప్పుడైనా ప్రధాని నెహ్రూ తన ఆరోపణలను ఉపసంహరించుకొంటూ ప్రకటన చేయలేదు.

ఎల్లప్పుడూ కాంగ్రెసునే బలపర్చుతూవచ్చిన గుజరాతీ ప్రజలు ప్రభుత్వంచేసిన ప్రజాస్వామిక విరుద్ధమైన ద్విభాషారాష్ట్ర నిర్ణయాన్ని ప్రతిఘటిస్తూ వీధులలోకి వచ్చారంటే, అందుకు కారణం ప్రభుత్వం అవలంబించిన వైఖరేనన్న విషయంగానీ, తుపాకీప్రియులైన పోలీసుల దుష్ప్రవర్తనేనన్న విషయంగానీ (శ్రీ) నెహ్రూ అంగీకరించనే అంగీకరించరు.

ఈ విషయాలన్నింటినీ సోషలిస్టు దేశాలలో జరిగిన తప్పులను తక్కువ అంచనా వేయటానికి కాదు ఏకరువుపెట్టుతున్నది; వాస్తవ విషయాలను సరియైన దృక్పథంతో పరికించటానికి మాత్రమే ఇదంతా చెప్పవలసివచ్చింది.

## పెట్టుబడిదారీవిధానం, సోషలిజం - సాపేక్షపరిశీలన

సోవియట్‌యూనియన్‌లోను, నూతన ప్రజాతంత్రదేశాలలోను జరిగిన క్రూరకృత్యాల విషయంలో బూర్జువావర్గ ఆరాధకులూ, వారిని సమర్థించేవారూ పెడబొబ్బలు పెట్టుతున్నారు. వారిని అలాగే పెట్టనివ్వండి. వారు వాటిని ఖండిస్తున్నారు; ఖండించనివ్వండి. ఎందుకంటే అన్యాయం ఎక్కడ జరిగినా ఖండించవలసిందే. అయితే ప్రజాస్వామ్యంపేరుతో ఏ వ్యవస్థనైతే వారు ఆరాధిస్తున్నారో, ప్రస్తుతిస్తున్నారో ఆ వ్యవస్థ మంచిచెడ్డలను కనీసం ఒక పర్యాయమైన నిజాయితీపరులవలె పరిశీలిస్తే మంచిది.

పెట్టుబడిదారీ విధానంయొక్క రక్తసిక్త చరిత్రను వారొకసారి పరికించాలి; ఒక్క 42 సంవత్సరాలకాలంలోనే అది తెచ్చిపెట్టిన రెండు ప్రపంచయుద్ధాలు, ఆ యుద్ధాలలో మరణించిన లక్షలాది అభాగ్యులు, ఫాసిస్టు హింసాకాండ, పురుషులను, స్త్రీలను, పిల్లలను అణ్వస్త్రాలతో కాల్చి చంపటం, స్వాతంత్ర్యప్రియ దేశాలను అణ్వస్త్రాలు చూపించి భయపెట్టటం, కార్మికవర్గాన్ని, రైతాంగాన్ని, వలసప్రజల విమోచనోద్యమాలను రక్తపుటేరులలో ముంచెత్తటం, నల్లజాతులపై సాగిస్తున్న అమానుషచర్యలు, స్త్రీలను బానిసలుగా చూడటం, జనబాహుళ్యాన్ని దారిద్ర్యానికి, నిరుద్యోగరాకాసికి, అంటువ్యాధులకు బలిచేయటం, చివరకు శాంతికాలంలోకూడా ఒకప్రక్క భోగభాగ్యాలు, మరొకచోట కటికదారిద్ర్యం తాండవమాడటం, అంటువ్యాధులతో అశేష ప్రజాసామాన్యం మారణరాకాసికి గురికావటం – ఈ వాస్తవిక విషయాలన్నింటిని వారు పరిశీలించాలి. విజ్ఞానశాస్త్రం అమోఘ విజయాలను సాధించిన తర్వాతకూడా, స్వేచ్ఛాప్రపంచం అని పిలువబడుతున్న ప్రాంతాలలో అశేష ప్రజాసామాన్యం దారిద్ర్యంతో, అర్ధాకలితో, యమయాతనలతో బ్రతకవలసిన దుర్గతి ఎందుకుపట్టిందో వారు వివరించాలి.

అక్టోబరు విప్లవంవల్ల నూతన తరహా ప్రజాస్వామ్యం – కార్మికవర్గ నాయకత్వాన శ్రమజీవుల ప్రజాస్వామ్యం – అవతరించింది. అన్ని స్థాయిలలో అధికారాన్ని నిర్వహిస్తున్నది ప్రజాసామాన్యమేకాని, రాజకీయాలను వృత్తిగా పెట్టుకొన్న రాజకీయవేత్తలూ కాదు; నిరంకుశాధికారులూ కాదు. అంతేకాదు; దేశీయ శత్రువులబారినుంచి, విదేశీ శత్రువులబారినుంచి విప్లవ విజయాలను కాపాడేందుకు, ప్రజల జీవన స్థితిగతులను మెరుగుపర్చేందుకు, మనిషిని మనిషిదోచుకొనే పద్ధతికి స్వస్తిచెప్పే నూతన ఆర్థిక వ్యవస్థను నెలకొల్పేందుకు ఆ అధికారం ప్రధానంగా ఉపయోగించబడుతోంది.

సోవియట్ యూనియన్ తన పౌరులకు నామమాత్రమైన, సరిసమానమైన హక్కులను ప్రకటించి వూరుకొనలేదు; వర్గదోపిడీకి, వర్గ ఆధిపత్యానికి స్వస్తిచెప్పటంద్వారా అది సరిసమానహక్కులను ఆచరణ సాధ్యమైయ్యేటట్లు భద్రపర్చింది; తత్ఫలితంగా ఆ దేశంలో ఎంతో వెనకబడియున్న ప్రాంతాలుసైతం అనతికాలంలో ఎంతగానో అభివృద్ధిచెందాయి. సోవియట్ యూనియన్ తన పౌరులకు కేవలం ఓటుచేసే హక్కు మాత్రమే కాక, ఉద్యోగ వసతి, వైద్య వసతి, విద్యాభ్యాస హక్కులను కూడా కలుగజేసింది.

తూర్పుయూరప్‌లోని నూతన ప్రజాతంత్రదేశాలు తమ పరిశ్రమలను నిర్మించుకొనేందుకు సోవియట్‌యూనియన్ సౌహార్ద సహాయం చేసింది. చైనాకు సోవియట్‌యూనియన్‌చేసిన సహాయం జగద్విదితం. చైనా నమ్మశక్యంకానంత త్వరితగతిని అభివృద్ధి చెందిందంటే అందుకుగల ముఖ్యకారణాలలో ఒకటి సోవియట్ యూనియన్ చేసిన అమూల్యసహాయమేనని చెప్పాలి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, దేశదేశాలమధ్య కొత్తతరహా సంబంధాలు నెలకొన్నాయి. ఆర్థికంగా అభివృద్ధిచెందినదేశాలు తమ ఆర్థిక స్తోమతను వెనకబడినదేశాలపై పెత్తనం చెలాయించటానికికాక, వాటిని అభివృద్ధిచేయటంలో సాయపడటానికి ఉపయోగిస్తున్నాయి. భారత, ఈజిప్ట్, తదితర బడుగుదేశాలతో సోవియట్‌యూనియన్ కుదుర్చుకొన్న ఆర్థికఒప్పందాలకు ఆయా దేశాలలోని ప్రభుత్వాలు, ప్రజలు హర్షామోదాలు వ్యక్తం చేశారు.

సోవియట్ యూనియన్‌లో సాధించబడిన విజ్ఞానశాస్త్ర విజయాలూ, సాంకేతికాభ్యున్నతీ ప్రజలశ్రేయస్సుకు దోహదకరమవుతున్నాయేగానీ, ఏవో కొద్దిమంది వ్యక్తుల లాభాలు పెరగటానికి దారితీయటంలేదు. ప్రపంచంలోకల్లా మొట్టమొదటగా సోవియట్ యూనియన్‌లోనే అణుశక్తి మానవాభ్యుదయానికి వినియోగించబడుతున్నది.

సోషలిస్టులమని చెప్పుకొంటున్నవారు యీ క్రింది ప్రశ్నకు సహేతుకమైన సమాధానం చెప్పాలి: మార్క్సిజం - లెనినిజానికి చెందిన భావాలతో ఉత్తేజితమైన ఉద్యమాలు ఏ ఏ దేశాలలో అయితే విజయవంతమయాయో, ఆ యా దేశాలలో మాత్రమే ఉత్పత్తిసాధనాలపై వ్యక్తి యాజమాన్యం రద్దయిపోయింది; ప్రజల జీవనప్రమాణం అపారంగా పెరిగింది; నిరుద్యోగం, సంక్షోభాలు రూపుమాపబడ్డాయి. అలా ఎందుకు జరిగిందంటారు?

1929 సంవత్సరంతో పోల్చి చూసుకొంటే, 1955 లో అన్ని పెట్టుబడిదారీ దేశాలలోని మొత్తం పారిశ్రామికోత్పత్తి నూటికి 100 వంతులకన్నా తక్కువగా పెరిగింది. అదేకాలంలో సోవియట్ యూనియన్‌లో మొత్తం పారిశ్రామికోత్పత్తి నూటికి 2000 వంతులు పెరిగింది. 1955 లో పోలెండ్‌లో యుద్ధాత్పూర్వపు పారిశ్రామికోత్పత్తి స్థాయికన్నా నాలుగురెట్లు మించి పెరిగింది. బల్గేరియాలో అయిదు రెట్లు, రుమేనియాలో దాదాపు మూడురెట్లు, ఆల్బేనియాలో పదకొండు రెట్లు, తూర్పు జర్మనీలో రెట్టింపూ పెరిగాయి.

ఇక చైనా ప్రజారాజ్యం సాధించిన పురోభివృద్ధి కళ్లు మిరుమిట్లు గొల్పేవిధంగా వుంది. భూస్వామిక, పెట్టుబడిదారీ దాస్యం నుంచి సాధారణ —— ప్రజలు విముక్తమైననాడు, వారు సాధించగలిగిన దెట్టిదో చైనాలో కళ్ళకు కట్టినట్లు నిరూపితమైంది. చైనా సాధించిన విజయాల సంఖ్యావివరం చైనా కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభ నివేదికలో ఉదహరించారు; గాన వాటిని ఇక్కడ పునరుల్లేఖించవలసిన అగత్యంలేదు. అయితే అదేదో సంఖ్యా వివరం మాత్రమేకాదు. జాతీయ ఆర్థిక వ్యవస్థలో ప్రభుత్వరంగం సారధ్యస్థానం సంపాదించుకొంది; భారీ పరిశ్రమలు ఘనవిజయాలు సాధించాయి; 1949 తో పోల్చుకొంటే, పారిశ్రామికోత్పత్తి నాలుగురెట్లు పెరిగింది. పట్టపగ్గాలు లేకుండా పొంగులెత్తి ప్రవహించే మహానదులను అదుపులోపెట్టి, భూములను సాగుచేయటానికి అవసరమైన నీటిపారుదల వసతులు కల్పించబడ్డాయి. వ్యవ

సాయ రంగంలో సోషలిస్టు పరివర్తన ప్రధానంగా సాధించబడింది; వేలాది సంవత్సరాలుగా సామాజిక శృంఖలాల మధ్య బంధితులైన స్త్రీజనావళికి విముక్తి సిద్ధించింది; విద్యావకాశాలు నమ్మశక్యం కాని విధంగా హెచ్చాయి. వీటన్నిటితో మొత్తం దేశం రూపు రేఖలే పూర్తిగా మారిపోయాయి.

అన్ని సోషలిస్టు దేశాలలోవలెనే, చైనాలోకూడా అన్ని స్థాయిలలోను ప్రజలచే ఎన్నుకోబడిన సంస్థలే రాజ్యాధికారం నిర్వహిస్తున్నాయి. జాతీయ పునర్నిర్మాణకృషికి సంబంధించిన భగీరథపథకాలను అమలుజరిపేందుకు ఈ రాజ్యాంగసంస్థలు ప్రజాసహకారాన్ని సమీకరిస్తున్నాయి.

ఈ విజయాలన్నీ ఎలా సాధ్యపడ్డాయి ? అన్నప్రశ్నకు అధ్యక్షుడు మావోసేటుంగ్ చైనా కమ్యూనిస్టుపార్టీ 8వ మహా సభను ప్రారంభిస్తూ చేసిన ప్రసంగంలో ఇలా సమాధాన మిచ్చారు:

"మనదేశంలో సాధించిన విప్లవవిజయాలు, నిర్మాణ సంబంధమైన విజయాలు మార్క్సిజం – లెనినిజం పుణ్యంవల్లనే సాధ్యపడ్డాయి. మార్క్సిస్టు – లెనినిస్టు సిద్ధాంతాన్ని ఆచరణరీత్యా చైనావిప్లవంతో జోడించటం అన్న సిద్ధాంతసూత్రాన్ని మన పార్టీ తు. చ. తప్పకుండా పాటిస్తూ వచ్చింది".

అంతేకాదు; మిగతా సోషలిస్టు దేశాలలో జరిగిన పొరపాట్ల వంటివి చైనాలో దొర్లకపోవటం గమనార్హమైన విషయం. అసలు మార్క్సిస్టు – లెనినిస్టు సూత్రాలలోనే ఎక్కడో లోపం వుందని వివరించజూసే ప్రబుద్ధులు పై విషయాన్ని గుర్తుంచుకోటం మంచిది.

జాతీయ బూర్జువావర్గానికి చెందిన శక్తుల విషయంలోను, కార్మికవర్గేతర పార్టీల విషయంలోను చైనా కమ్యూనిస్టుపార్టీ అవలంబించిన వైఖరి ఎట్టిదో, సోషలిస్టు నిర్మాణంఅన్న పవిత్ర కర్తవ్య నిర్వహణకు దేశాన్ని సమైక్యపరుస్తూ, అన్నిశక్తుల సహకారాన్ని సంపాదించటానికి అనుసరించిన విధానమేమిటో లీ–షావ్ చీ

కమ్యూనిస్టుపార్టీ 8 వ మహాసభలో సమర్పించిన రాజకీయ నివేదికలో యిలా వివరించారు :

"ఇటీవలి కాలంలో అనేకమంది జాతీయ పెట్టుబడిదార్లు సోషలిస్టు పరిణామంయొక్క సత్ఫలితాలను స్వయంగా అనుభవించారు. వారితో సహకారం యికముందుకూడా కొనసాగేటట్లు, పెంపొందేటట్లు చూడ్డం మన కర్తవ్యం. అలాచేస్తే వారి శక్తిసామర్థ్యాలు, సాంకేతిక పరిజ్ఞానం మరింత వికసిస్తాయి ; వారిలో మానసిక పరివర్తన మరింత పెంపొందడానికి సహాయం చేసినవార మవుతాం. సహకారం అంటే అర్థం, యిదివరలో వలెనే ఏకకాలంలో ఐక్యతను సాధించటం, పోరాటం సల్పటం. సోషలిస్టు పరివర్తన పూర్తి అయ్యేవరకూ వర్గపోరాటం ఉంటుంది. ఆ తర్వాతకూడా చాలకాలంవరకు సోషలిస్టు దృక్పథాలకూ, పెట్టుబడిదారీ దృక్పథాలకూ మధ్య, సోషలిస్టు పద్ధతులకూ పెట్టుబడిదారీ పద్ధతులకూ మధ్య పోరాటం తప్పదు. అట్టి పోరాటాన్ని నడపడంలో మనం ప్రధానంగా ఒప్పించే పద్ధతిని, శిక్షణగరపే పద్ధతిని చేబట్టాలి. సోషలిజంపట్ల శత్రువైఖరి నవలంబిస్తూ ప్రభుత్వ చట్టాలను ఉల్లంఘించే కొద్దిమంది వ్యక్తులయెడ మాత్రమే, ఆ యా పరిస్థితులనుబట్టి నిర్బంధంగా సంస్కరించే పద్ధతిని అమలు జరపాలి.

## ప్రజాతంత్ర పార్టీల స్థానం

మన దేశంలో జపాన్ దురాక్రమణకు వ్యతిరేకంగా యుద్ధం జరుగుతూన్న రోజుల్లోనే ప్రధానంగా ప్రజాతంత్ర పార్టీలు స్థాపించబడ్డాయి. వాటికీ, మన పార్టీకీ మధ్య సహకారం చాలకాలం వర్ధిల్లింది. చైనా ప్రజారిపబ్లిక్ అవతరించిన తర్వాత ఆ పార్టీలు ప్రజాప్రభుత్వంలో పాల్గొన్నాయి. తర్వాత క్రమంగా అవి సోషలిస్టు లక్ష్యాన్ని బలపరిచాయి. కమ్యూనిస్టుపార్టీ, యితర ప్రజాతంత్ర పార్టీలు చాలకాలం

వరకు సహజీవనం నెరపుకొనే విధానం, అన్యోన్యంగా తనిఖీ చేసుకొనే విధానం ఇప్పటినుంచీ అమల్లోకి రావాలి. చైనాలో నేడు ప్రజాతంత్ర పార్టీలకుగల సాంఘిక పునాదులు జాతీయ పెట్టుబడిదారీ వర్గం, పెటీబూర్జువా వర్గంలో ఉన్నతశ్రేణి యీ వర్గాలకు చెందిన మేధావులు. సోషలిస్టు పరిణామం పూర్తి అయిన తర్వాత జాతీయ పెట్టుబడిదారీవర్గానికి చెందినవారు, పెటీబూర్జువావర్గంలో ఉన్నతశ్రేణికి చెందినవారు సోషలిస్టు కార్మికులలో ఒక భాగంగా అవుతారు; అప్పుడు ప్రజాతంత్ర పార్టీలు యీ తరగతికి చెందిన కార్మికులకు ప్రాతినిధ్యం వహిస్తాయి. ఈ తరగతికి చెందినవారిలో బూర్జువా భావాల అవశేషాలు చాలకాలంవరకు ఉంటాయి. అందుచేత ప్రజాతంత్ర పార్టీలు వారితో చాలకాలంవరకు సంబంధా లుంచుకోవలసివస్తుంది; వారి కోర్కెలకు ప్రాతినిధ్యం వహించవలసియుంటుంది; వారిలో మానసిక పరివర్తన తీసుకురావడానికి సహాయపడవలసి యుంటుంది. అదే సమయంలో, ప్రజాతంత్ర పార్టీలూ, కమ్యూనిస్టుపార్టీ చాల కాలంవరకు సహజీవనం నెరపుకోవలసివుంటుంది. కనుక యీ పార్టీలన్నీ అన్యోన్యంగా తనిఖీచేసుకోగల్గుతాయి. మన పార్టీ స్వార్థ ప్రయోజనాలకై పనిచేసేది కాదు; అది తన యావచ్ఛక్తినీ హృదయపూర్వకంగా ప్రజాసేవకు వినియోగిస్తుంది. కాని, మనలో యిప్పటికీ లోపాలున్నాయి; యికముందుకూడా లోపాలనేవి ఉంటాయి. ఎలాంటి తప్పులూ యిక జరగవనే హామీ లేదు. అయితే మనం యీ లోపాలను, తప్పులను సరిదిద్దుకోవాలి. ఇందుకు మనం మొట్టమొదట పార్టీలో యింకా యెక్కువ తీవ్రమైన ఆత్మవిమర్శలకు ప్రోత్సాహమివ్వాలి; కష్టజీవులైన ప్రజాసామాన్యం ఎప్పటికప్పుడు తనిఖీచేసే పద్ధతిమీద మనం ఆధారపడాలి. అదే సమయంలో, అన్ని ప్రజాతంత్ర పార్టీల సభ్యులు, ఏ పార్టీకి చెందని ప్రజాస్వామ్యవాదులు చేసే తనిఖీవల్ల, విమర్శలవల్ల లాభం పొందడంలో నేర్పరితనాన్నికూడా ప్రదర్శించాలి.

"అనేక పరిపాలనా సంస్థలలో ప్రజాతంత్రపార్టీల ప్రతినిధులు, ఏ పార్టీకి చెందని ప్రజాతంత్రవాదులు ముఖ్యమైన పదవు లలంక రిస్తున్నారు. ప్రభుత్వ సంస్థలలోను, విద్యాలయాల్లోను, పరిశ్రమ ల్లోను, సాయుధ దళాల్లోను పార్టీతో సంబంధంలేని వా రనేకమంది ఉద్యోగాలు చేస్తున్నారు. ఇట్టి పరిస్థితుల్లో మన పార్టీ అలాంటి వారందరితో సత్సంబంధాలుంచుకొని అన్యోన్య సహకారంతో పనిచేయాలి. ఈ విషయాన్ని ప్రస్తావించవలసిన అవసర మెందుకు వచ్చిందంటే, మన పార్టీలో కొందరు సభ్యులు సమస్తమైన వస్తు వులూ "ఒకేరంగులో ఉండాల"ని భావిస్తున్నారు; కమ్యూనిస్టుపార్టీకి చెందనివారు పరిపాలనాసంస్థల్లో పనిచేస్తూంటే చూడ్డం వారి కిష్టం లేదు; అవసరమైనప్పుడు వారితో సంప్రదించడం వారికి గిట్టదు; వారి అధికారాన్ని గౌరవించడమంటే యీసడించుకుంటారు. ఇదొక రకమైన అతివాదపాక్షిక (సెక్టేరియన్) ధోరణి. కమ్యూనిస్టులు ఎల్లప్పుడూ ప్రజల్లో అల్పసంఖ్యాకులుగానే ఉంటారు. అందుచేత వారు అన్నిపరిస్థితుల్లోను కమ్యూనిస్టుపార్టీకి చెందని ప్రజలతో సహకరించడం తప్పనిసరి అవుతుంది; పై విధమైన లోపాలను వారు తొలగించుకోవలసియుంటుంది. నూతనప్రజాతంత్ర ఐక్యసంఘటనను పటిష్ఠ మొనర్చడానికి మనం నిర్వర్తించవలసిన ప్రధాన కర్తవ్యా లలో యిదొకటి."

సాధించిన విజయాలను ఆధారంచేసుకొని, హానికరమైన కొన్ని దృక్పథాలవల్ల లోగడ జరిగిన కష్టనష్టాలను దృష్టిలో వుంచుకొని, చైనాపార్టీ ఈ వైఖరిని అవలంబిస్తున్నదన్న విషయం అంతా గుర్తించాలి. మన సూత్రాలు నిర్జీవమైన పిడికట్టు సూత్రాలవంటివి కావనీ, కార్యాచరణకు కరదీపికవంటివనీ పైన పేర్కొన్న విషయాలు స్పష్టంచేస్తున్నాయి. మార్క్సిజం - లెనినిజం సజీవమైన సమస్యలను అత్యంత మానవతాదృష్టితో పరిష్కరిస్తుందని పై విషయాలు రుజువుచేస్తున్నాయి.

ప్రపంచంలో మొట్టమొదటగా ఒక దేశంలో కమ్యూనిస్టు ఉద్యమం విజయవంతమై యింకా 40 యేళ్ళన్నా నిండలేదు. ఈ దశలో కమ్యూనిస్టులు కొన్ని పొరపాట్లుచేసినమాట నిజమే: తాము అధికారంలోవున్న దేశాలలోను, ప్రజాపోరాటాలు సాగిస్తున్న దేశాలలోను వారు పొరపాట్లు చేశారు. అయితే, ప్రపంచ కమ్యూనిజం తన ఈ స్వల్పజీవితకాలంలో సాధించిన విజయాలను, అపజయాలను, అంతకుపూర్వపు వ్యవస్థలు లేదా ఉద్యమాలు సాధించిన విజయాలతోను, అపజయాలతోను ఎవరైనా పోల్చి చూసుకోవచ్చు.

ఇటీవల సంవత్సరాలలో మార్క్సిస్టు - లెనినిస్టు భావాలతో ఉత్తేజితమైన ప్రపంచ ఉద్యమం ప్రపంచఘటనల తీరుతెన్నులను తీర్చిదిద్దినంతగా మరి యేయితర ఉద్యమం తీర్చిదిద్దలేదు. అంతటి అఖండవిజయాలను మరి యే యితరఉద్యమం సాధించలేదు. ఇదంతా ఏదో కాకతాళీయంగా సంభవించనదికాదు. మార్క్సిస్టు - లెనినిస్టు సూత్రాలలో సత్యంవుంది కనుకనే అవి అంత శక్తివంతంగా వున్నాయి.

అదేసమయంలో మనం మరొకవిషయం గుర్తించాలి. అనేక సమస్యలవిషయంలో, అనేకసందర్భాలలో ఈ సూత్రాలను విసర్జించి, పెడమార్గం పట్టటం సంభవించింది. ఉత్పత్తిసాధనాల పైన వ్యక్తిగత యాజమాన్యం రద్దుకావటంతోను, శత్రువర్గాలను రూపుమాపటం పూర్తికావటంతోను పరిపూర్ణమైన ప్రజాస్వామ్యం దానంతటదే స్థాపితమై పోతుందన్న ధోరణి ప్రబలింది. పిడికట్టు సూత్రవాదం, వాటితోపాటు నాన్‌పార్టీ ప్రజాతంత్ర వాదులు చేస్తున్న విమర్శపట్ల శత్రుత్వం వహించటంవంటి ధోరణులు పెచ్చుపెరిగాయి. ఒకదేశంలో గడించిన అనుభవాన్ని తీసుకొని, మరొకదేశంలో ప్రత్యక్షమయ్యే సమస్యలను పరిష్కరించేందుకు దానిని యాంత్రికంగా ఉపయోగించే ధోరణికూడా అనేక పార్టీలలో తలెత్తింది.

ఇలాంటి పొరపాట్లు, తప్పుడు ధోరణులు, చర్యలు, పద్ధతు లలో అనేకవాటిని నివారించటానికి లేదా కనీసం మొగ్గలోనే త్రుంచివేయటానికి వీలున్నది. అవే కనుక జరిగియుండకపోయిన పక్షంలో మార్క్సిజం – లెనినిజం ఇప్పటికన్నా ఘనతర విజయా లను సాధించి వుండేది. అందుచేత వాటికి వ్యతిరేకంగా గట్టి పోరాటం సాగిస్తూ, అవి తలెత్తటానికిగల మూలకారణాలను పెక లించివేయాలి.

సోవియట్ యూనియన్‌లోను, నూతన ప్రజాతంత్ర దేశాల లోను జరిగిన పొరపాట్లవల్ల శ్రామిక ప్రజలలోను, ప్రజాతంత్ర జనసామాన్యంలోను కొంత గందరగోళం, దిగ్భ్రమ వ్యాపించిన మాట నిజమే. అయితే ఇది ఎంతో కాలం వుండబోదు. పరిస్థితి యిప్పటికే కొంతవరకు సుస్పష్టమవుతోంది. మొదట్లో దిగ్భ్రాంతి చెందిన అనేకమంది వ్యక్తులు జరిగిన పొరపాట్ల మంచి చెడ్డలను గురించి ఇప్పుడు తాపీగా ఆలోచిస్తున్నారు; ఆపొరపాట్లు జరగటానికి కారణాలేమిటో పర్యాలోకిస్తున్నారు; వాటిని అధిగమించటానికి గైకొంటున్న చర్యలు కాంచి సంతృప్తికూడా చెందుతున్నారు.

కమ్యూనిస్టు ఉద్యమం ఘటనలనుంచి, ప్రజలనుంచి నేర్చు కోటానికి సదా సిద్ధంగా వుంటుంది. అందుచేత ఈ ఘటనలనుంచి కమ్యూనిస్టు ఉద్యమం అంతా గుణపాఠాలను స్వీకరించి ప్రజలపట్ల తాను నిర్వర్తించవలసిన కర్తవ్యాలను అది ఉత్తరోత్తరా మరింత సమర్థవంతంగా నిర్వర్తిస్తుంది.

## సోషలిజం - ప్రజాస్వామ్యం

ఈ సందర్భంలో సోషలిజానికి, ప్రజాస్వామ్యానికి మధ్యగల సంబంధ మేమిటో తిరిగి స్పష్టీకరించ వలసిన అవసరంవుంది.

సోషలిస్టు ఉద్యమానికి వ్యతిరేకంగా బూర్జువావర్గం తాము సాగించే పోరాటంలో అనేక ఆయుధాలను ఉపయోగించింది. వాటిలో ఒకటి ప్రచార ఆయుధం. పెట్టుబడిదారీ విధానం ఒక్కటే

విజ్ఞాన శాస్త్రాన్నీ, సాంకేతిక శాస్త్రాన్నీ ముందుకు తీసుకుపోగలదని ఒకప్పుడు వారు అంటూవచ్చారు. వర్తమాన పారిశ్రామిక సమాజం నానాగజిబిజిగా వున్నందునల్ల, పెట్టుబడిదారీ విధానానికి చెందిన వ్యక్తియాజమాన్యసూత్రం తప్ప మరొక గత్యంతరం లేదని వారంటూ వచ్చారు. పెట్టుబడిదారీ విధానాలు రద్దుచేస్తే పరిశ్రమలు కుప్ప కూలి పోతాయనీ, ఉత్పత్తిలో అరాచకం ప్రబలుతుందనీ, విశ్వవ్యాప్త దారిద్ర్యం అలుముకొంటుందనీ, అసలుమానవ నాగరికతకే తీరని దెబ్బ తగులుతుందనీ వారు జోస్యం చెప్పుతూ వచ్చారు. అక్టోబరు విప్లవానంతరం, రష్యాలో ఆర్థిక పరిస్థితులు, ఇంతకుముందే విశదీకరించిన కారణాలవల్ల దుస్తరమవుతున్నట్లు కన్పించగానే, "చూశారా మేము చెప్పిన సిద్ధాంతాలు ఆచరణలో రుజువవుతున్నాయ"ని వారు ఘనంగా చెప్పుకొన్నారు.

ఒకనాడు వారు ఏమాటలనైతే చెప్పుతూవచ్చారో, వాటినే ఈనాడు చెప్పటానికి వారు సాహసించలేకపోతున్నారు. తమ ఆర్థిక సిద్ధాంతాలను ఆధారంచేసుకొని వారు చెప్పిన జోస్యాలన్నీ అభాసుపాలయ్యాయి. వారు చెప్పిన జోస్యాలకు పూర్తిగా విరుద్ధమైన పద్ధతిలో సోషలిస్టు ప్రపంచం ప్రవర్థమానమైంది.

అయితే సోషలిజానికి శత్రువులైనవారు తమ దుష్ట ప్రయత్నాలను యింకా కొనసాగిస్తూనే వున్నారు. మహా ప్రవాహంలాగా ఉరకలుపెట్టుకొంటూ పొంగులెత్తుతున్న విప్లవాన్ని అడ్డుకోటానికి కుంటికాళ్లు అడ్డంపెట్ట ప్రయత్నిస్తున్నారు. సోషలిజం, ప్రజాస్వామం ఒకదానిసరసన మరొకటి శాంతియుత సహజీవనం నెరవుకోటం సాధ్యం కాదంటున్నారు వారు. సోషలిస్టు సమాజం శాస్త్రీయ సాంకేతికాభ్యున్నతిని సాధిస్తే సాధించవచ్చు; పెట్టుబడిదారీ విధానంకన్న సుస్థిరమైన పునాదిపై అది ఉత్పత్తిని కొనసాగిస్తే కొనసాగించవచ్చు; సంక్షోభం, నిరుద్యోగం లేకుండా అది చేసినా చేయవచ్చు; కాని, సోషలిస్టు సమాజంలో ప్రజాస్వామ్యమూ,

స్వాతంత్ర్యమూ లభించగలవనుకోటంమాత్రం ఎడారిలో ఎండమావులను చూసి భ్రమించటంవంటిదే కాగలదని వారు యిప్పుడు సెలవిస్తున్నారు. సోషలిజంఅంటే వ్యక్తిస్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని అరికట్టడం, జీవితాన్ని, ఆలోచనను ఒకే మూసలో పోయటం మాత్రమేనని వారు వక్కాణిస్తున్నారు. అక్టోబరు విప్లవానంతరం సోవియట్ యూనియన్‌లో సంభవించిన కొన్ని పరిణామాలను వారు అవకాశంగా తీసుకొని, తమ ఆర్థిక సిద్ధాంతాల గొప్పను చాటుకోడానికి ఎలాగైతే ప్రయత్నించారో, అలాగే సోషలిస్టు దేశాలలో జరిగిన కొన్ని పొరపాట్లను, క్రూర కృత్యాలను అవకాశంగా తీసుకొని యిప్పుడు తమ రాజకీయ సిద్ధాంతాల గొప్పను చాటుకోచూస్తున్నారు. గతంలోవలెనే యీనాడుకూడా వారు తమ వాదనలకు పనికివచ్చే అంశాలను గోరంతలను కొండంతలు చేస్తూ, మిగతా అంశాలను మభ్యపెట్ట చూస్తున్నారు.

అయితే సోషలిజానికి వ్యతిరేకంగా వారు గతంలోచేసిన వాదనలవలెనే, యీనాడు వారు చేస్తూన్న కొత్తవాదనలు కూడా చెల్లుబడి కావు.

వారి వాదనలలోని బండారాన్ని కాస్తా వాస్తవ ఘటనలు బయటపెట్టుతున్నాయి.

సోషలిజం, ప్రజాస్వామ్యం – ఈ రెండూ పరస్పర విరుద్ధమైన సూత్రాలు కాకపోగా, ఆ రెండింటి మధ్య సన్నిహితమైన అవినాభావసంబంధంవుంది.

ఇతఃపూర్వపు విప్లవాలు ప్రతి రంగంలోను, చివరకు మానవ సంబంధాల విషయంలో కూడా సాధించిన అభ్యున్నతికి సోషలిజం విలువ కట్టుతుంది. ఇతఃపూర్వపు సమాజాలు రూపొందించిన ఉదాత్త సూత్రాలను సోషలిజం పరిపోషిస్తూ పరిపుష్టమొనర్చుతూ పెంపొందిస్తుంది; ఆ సూత్రాలను పరిపుష్టమొనర్చి,

ప్రతి రంగంలోను తు. చ. తప్పకుండా అమలుజరుపుతుంది. పెట్టుబడిదారీ ఆస్తి సంబంధాలు, దోపిడీ విధానం పూర్తిగా మాసిపోయిననాడే స్వేచ్ఛ, సరిసమానత్వం, సహోదరత్వంవంటి మహోన్నత భావాలు చరిత్రాత్మక విజయం సాధిస్తాయి. ఆ విధంగా సోషలిజం హయాంలో మాత్రమే ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం పరిపూర్ణమైన సార్థక్యం పొందుతాయి. అంతేకాక, ప్రజాస్వామ్యాన్ని క్రమపద్ధతిలో విస్తరింపచేయటం ద్వారా మాత్రమే సోషలిస్టు సమాజం పరిపూర్ణంగా విలసిల్లటానికి, ఆ సమాజంలోని బలహీనతలను, లోపాలను, గతానికి చెందిన అరిష్టాల అవశేషాలను పూర్తిగా తొలగించటానికి వీలు చిక్కుతుంది.

## మా సంకల్పం

సోషలిస్టుఉద్యమం, సోషలిస్టు దేశాలు సంపాదించిన మొత్తం అనుభవసంపదనుంచి ఇతర దేశాల కమ్యూనిస్టులతోపాటు భారత కమ్యూనిస్టులమైన మేము గుణపాఠాలు గ్రహిస్తాం. మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలు మహోన్నతమైనవని గతంలో సాధించబడిన అపూర్వవిజయాలు నిరూపిస్తున్నాయి; అలాగే ఆచరణలో ఈ సూత్రాలనుంచి విడివడి పెడమార్గం పట్టటంకూడా అనేక సందర్భాలలో సంభవించినదనికూడా గతానుభవం చాటి చెబుతోంది. సోవియట్ యూనియన్‌లోను, ఇంకా అనేక సోషలిస్టు దేశాలలోను జరిగిన క్రూరకృత్యాలు, పొరపాట్లు మన దేశంలో జరగకుండా వారించాలని మేము సంకల్పసిద్ధులమై కృషిచేస్తున్నాము.

కమ్యూనిస్టుపార్టీ కృషి ఫలప్రదమై సోషలిస్టు భారతదేశం ఏర్పడితే, అప్పుడు భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ మినహా మిగతా పార్టీలన్నీ అణచివేయబడతాయని మా శత్రువులు నిందా ప్రచారం చేస్తున్నారు. సోషలిస్టు భారతదేశంలో ప్రభుత్వ విధానాలను విమర్శించే స్వేచ్ఛగానీ, పత్రికా స్వాతంత్ర్యంకానీ మచ్చు

కైనా కన్పించవని వారు అంటున్నారు; వ్యక్తిస్వాతంత్ర్యం అదృశ్య మైపోతుందంటున్నారు.

ఈ ఆరోపణలన్నీ కేవలం నిరాధారాలని మేము ఘంటా పథంగా చెప్పగలం. సోషలిజం ప్రవర్ధమానం కావాలంటే, ప్రజాస్వామ్య సూత్రాలను పాటిస్తూ, వాటిని నిరంతరం యింకా విస్తరింపచేయటం ఎంతో అవసరమని మేము గట్టిగా విశ్వ సిస్తున్నాం. వ్యక్తిస్వేచ్ఛకు పూర్తిభద్రత లేకపోయినా, లేదా ఆ స్వేచ్ఛకు భంగంవాటిల్లినా సోషలిస్టు ఆశయానికే విఘాతం కలుగుతుందని మా విశ్వాసం. వ్యక్తిగత హక్కులను గట్టిగా రక్షించటంద్వారా మాత్రమే సోషలిజం విలసిల్లుతుందని మా పూర్తి నమ్మకం.

ఉత్పత్తి సాధనాలపైన వ్యక్తి యాజమాన్యాన్ని రద్దు చేయటంవల్ల, చరిత్రలో తొలిసారిగా నిజమైన ప్రజాస్వామ్యానికి భౌతిక పరిస్థితులు సమకూడుతాయి. అయితే, అలాంటి ప్రజా స్వామ్యం దానంతటదే సిద్ధించబోదు. దానిని కంటిలోపాపలాగా కాపాడుకుంటూ విస్తరింపచేయవలసివుంటుంది. అలా చేయకపోతే సోషలిజం సర్వతోముఖాభివృద్ధికే విఘాతం కలుగుతుంది.

మానవాళిలో మూడోవంతు ప్రజలు ఈనాడు సోషలిస్టు ప్రపంచంలో నివసిస్తున్నారు. సోషలిస్టు ప్రపంచంయొక్క భౌతిక, నైతిక స్తోమత ఈనాడు అపారంగా అభివృద్ధిచెందింది. ప్రజాబా హుళ్యంలో సోషలిస్టు భావాలు గట్టిగా వేరూనినవి. అందువల్ల శాంతియుత పద్ధతులలో సోషలిస్టు శక్తులు అధికారం హస్తగతం చేసుకొని, వ్యక్తిగత హక్కులను ప్రజలు పరిపూర్ణంగా అనుభ వించటానికి వీలుగా ఆ అధికారాన్ని వినియోగించేందుకు ఈనాడు అవకాశాలు ఎక్కువగా వున్నాయి. కార్మికవర్గం, దాని అగ్ర గామిదళం నాయకత్వాన అధికారం ప్రజల హస్తగతమవ్వటం సోషలిస్టు వ్యవస్థాపనకు తొలిమెట్టు. అయితే, ప్రజాబాహుళ్యంతో రూపొందిన ఐక్యసంఘటనద్వారా శ్రామికవర్గ నియంతృత్వాన్ని

నిర్వహించేందుకు అవసరమైన పరిస్థితులు ఈనాడు ఏర్పడ్డాయి. సోషలిజంకోసం పాటుబడుతున్న కమ్యూనిస్టు, సోషలిస్టు తదితర ప్రజాస్వామిక పక్షాలు ఆ ఐక్యసంఘటనలో వుంటాయి. మేము ఊహిస్తున్న సోషలిస్టు భారతదేశంలో పార్లమెంటరీ ప్రభుత్వమూ వుంటుంది; దానితోపాటు రాజకీయ పార్టీల న్యాయసమ్మతమైన హక్కులూ భద్రపర్చబడతాయి; శాంతి పద్ధతులలో, రాజ్యాంగ చట్టానికి బద్ధులై ఏ రాజకీయ పక్షమైనా ప్రతిపక్షంగా వ్యవహరించదలచుకొంటే, అందుకు సోషలిస్టు భారతదేశంలో అవకాశం వుంటుంది.

విభిన్న పక్షాలు వున్నంతమాత్రాన సోషలిస్టువ్యవస్థ దుర్బలమైపోదు. పైగా సమష్టికర్తవ్యాల నిర్వహణలో పరస్పరవిమర్శ, ఆత్మవిమర్శ, పరస్పరం తనిఖీచేసుకోటం, ఒకరినుంచి మరొకరు నేర్చుకోటం, పరస్పర సహకారం — వీటన్నిటి సహాయంతో అనేక లోపాలను తొలగించుకోవచ్చు; ప్రజాస్వామ్య ఉల్లంఘనలు జరగకుండా వారించి, మొత్తం సోషలిస్టువ్యవస్థను పటిష్ఠవంతం చేయవచ్చు.

వర్గపాలనను రద్దుచేసి, ఉపాధిని గురించిన భయాందోళనల నుంచి ప్రజలను విముక్తంచేసే సోషలిస్టుసమాజం వర్గసహిత సమాజాలలో ఏ ఒకటికూడా సమకూర్చలేనంతటి ఇతోధిక వ్యక్తిస్వేచ్ఛను భద్రపర్చగలదు. మా పార్టీకి పరిపూర్ణమైన యీ సత్యం శిరోధార్యంగా వుంటుంది.

ప్రస్తుత వ్యవస్థలోని అన్యాయాలను ఏవగించుకొంటున్న ప్రజాసామాన్యం ప్రస్తుత వ్యవస్థస్థానే యింకా న్యాయసమ్మతమైన, మానవత్వంతోకూడిన, ప్రజాస్వామికయుతమైన వ్యవస్థను ఏర్పాటుచేయాలని కోరుతున్నారు. ప్రపంచంలో అపూర్వమైన పరిణామాలు సంభవించాయి; సోషలిస్టుభావాలు ప్రజల మనస్సులలో గట్టిగా వేరూనినవి; అంతేకాక, మన దేశంయొక్క, ప్రజలయొక్క, మహోన్నతమైన సంప్రదాయాలు, ప్రజాస్వామ్యం

పట్ల వారిలోగల విశ్వాసం, అన్నిరూపాలలోని నిరంకుశత్వంపట్ల వారిలోగల తీవ్రవ్యతిరేకత, శాంతిపట్ల వారిలోగల గాఢానురక్తి- వీటన్నిటివల్ల సోషలిస్టుపథంలో మన పురోగమనం సుకరమవుతుంది.

అందుకోసం సోషలిస్టులు, కమ్యూనిస్టులు, నిజాయితీపరులైన కాంగ్రెసువాదులు, సచ్ఛీలురైన ప్రజాస్వామికశక్తులు - వీరంతా సమష్టి లక్ష్యసాధనకు ఏకమై, సత్సంబంధాలు నెలకొల్పుకుంటూ, సహకారం నెరపుకోవలసిన అవసరం వుంది. ఈ ఐక్యత ఎంత పటిష్ఠవంతమైతే, అంత ఎక్కువగా, అంత త్వరగా మన ఉమ్మడి లక్ష్యాలను సాధించగలుగుతాం; శాంతికోసం, జాతీయ నిర్మాణంకోసం, ప్రజల ప్రయోజనాల రక్షణకోసం, సామాజిక, ఆర్థిక, రాజ్యాంగ రంగాలలో ప్రజాస్వామ్య విస్తరణకోసం మనం సాగించే పోరాటాలలో సత్వర విజయాలను సాధించగలుగుతాం. మన దేశానికి అవసరమైన సమూలమైన పరివర్తనను సాధించటానికి బలోపేతమైన ప్రజోద్యమాన్ని నిర్మించగలుగుతాం.

అలాంటి ఐక్యతను సాధించవలసిన అవసరాన్ని గుర్తించిన మా పార్టీ అందుకోసం శక్తివంచనలేకుండా కృషిచేస్తుంది. మన దేశ ప్రజల శక్తిసామర్థ్యాలపట్ల, వారి ఉజ్వల భవిష్యత్తుపట్ల మాకు పూర్తివిశ్వాసం వుంది.



